సాదర సౌహార్ద సాంద్ర కృతి.

చెఱాల శివరామశాస్త్రి

TO

**Sri Rajah**
**Naraiah Appa Rao Bahadur**
**Zamindar Garu**

of

**Sri Bhadrachalam,**
**Palvancha & Nidadavole etc.,**
**Estates**

# సూచి.

## 1వ విమర్శము.



## 2వ విమర్శము.

## 4వ విమర్శము.



## ERRATA.

P. L.

15—2 (పైనూహించిన యూహలవలన)

36—14 అతని-నన్నయ

42—2 మసులో-మనసులో

45—15 నుస్నది-నున్నది.

53—15 దీర్చెదఁ-దీర్చెదఁ

58—18 నవ్వులు-నవ్వుల

58—19 మవ్యపు-మవ్వపు

" " మానినిలు-మానినులు

25 జొన్నలు-జొన్నల

60—11 తేర్చెదఁ-దేర్చెదఁ

77—2 నీని-నీ

93—3 యుటరయొఱుక-యుటసెఱుక

160—21 ఎఱ్ఱన-శ్రీనాథుఁడు,

160—22 ఎఱ్ఱన-శ్రీనాథుఁడు

106-17. [illegible] పంక్తి- పంచటి

107- 10, 20.



# క వి జీ వి త ము .



శ్రీ ఆంధ్రమహాకవులలో నుత్తముఁడని కొండాడఁబడుచున్న నాచన సోమనాథ మహాకవి చరిత్రము 1910 వ సంవత్సరముదాఁక నెవరికిని దెలియరాలేదు. ఈ మహాకవి చరిత్ర మాంధ్రులకుఁ దెలియఁజేసిన చిలుకూరి వీరభద్రరావుగారి నిచట నుతింప నేమఱఁగొనరాదు. వారాంధ్ర పత్రికలోఁ బ్రకటించిన శాసన మిచట నుదాహరించుచున్నాఁడను.

## శ్రీ గ ణా ధి ప త యే న మః.

అవ్యాద్వ్యాహతైశ్వర్య కారణో వారణాననః
వరత స్త్రివలిమిర మిహిరో వారణనందనః.
శ్రీమాన్ ఆదివరాహో యః శ్రియం దిశతు భూయసీం
గాఢమాలింగతయేన మేదినీ పాదకేసరా.
అస్తి శాస్త్రుధి మాణిక్య కామధేనుసహోదరః
రాజా ముజ్జికనాథః క్షీరసాగరసంభవః.

---

[illegible]

ఉదభూదాన్వయేతస్య యదుర్నామ మహీపతిః
పాలితాయత్కులీనేన వాసుదేవేన మేదినీ:
తత్కులే బుక్కనామాయః కీర్తిశౌర్యవిచక్షణః
గౌరాంబికాభవద్రాజ్ఞీ లక్ష్మీరివహరేర్యథా.
అభూత్తస్యసుతేశ్రీమాన్ అభంగురగుణోదయః
అపస్తదూరితాసంగ స్సంగమోనామభూపతిః.
మాలాంబికాభవద్రాజ్ఞీ తస్యరాజ్ఞశ్శుచిస్మితా
దమయంతీనలస్యేవ ఇంద్రస్యేవయథాశచీ
ఆసన్ హరిహరః కంపో బుక్కరాయమహీపతిః
మారపోముద్దపశ్చేతి కుమారస్తస్యభూపతేః.
పంచానామప్యగస్తేషాం ప్రశస్తోబుక్కభూపతిః
ప్రచండవిక్రమోమధ్యే పాండవా మివార్జునః.
భంగః కళింగామిత శౌర్యవృత్తే
ర్వంగావి భిన్నాంగ విఘూర్ణనేత్రాః
ఆంధ్రాశ్చ రంధ్రాణి విశంతి యస్య
బాహాగ్ర ఖడ్గేన విసీర్యమాణాః
తురుష్క శుష్కవదనా పాండ్యభూపః పలాయితః
స్వభుజార్జిత వీర్యేణ తస్మిన్ రాజ్యం ప్రశాసతి.
బుక్కరాయో భవచ్ఛ్రీమాన్ భుజార్జిత పరాక్రమః
మేదినీ చప్రజాయేన స్వపుత్రా ఇవరక్షితః.
రాజాధి రాజస్తేజస్వి యోరాజ పరమేశ్వరః
భాషాలంఘిత భూపాల భుజంగమ విహంగమః.
రాజరాజ భుజంగోయః పరరాయ భయంకరః
హిందూరాయసురత్రాణ ఇతిత్రైరుపశోభితః
విద్యాభిధాననగరీ విజయోన్నతశాలిని
విద్యారణ్యకృతాతస్యాం రత్నసింహాసనేస్థితః.
యస్మిన్ షోడశదానానాం ధారాయాంపరిశోభితః
దానాంబుధారయాతస్య వర్ధతేసర్మపాదపః.
అలంకృతశకస్యాష్టేరసర్తు నయనేందుభిః

తారణాబ్దే చైత్రమాసే నవమ్యాంశుక్లపక్షకే.
పంపాయాం భాస్కరక్షేత్రే విరూపాక్షస్యసన్నిధౌ
ఆపస్తంబాఖ్యసూత్రీయ భారద్వాజాన్వవాయనే.
యాజుషానాం వరేణ్యాయ సకలాగమవేదినే
అష్టాదశపురాణానా మభిజ్ఞాతార్థవేదినే.
అష్టభాషాకవిత్వశ్రీ శ్రీవాణీ జితసంపదే
సోమాయనాచనాంబోధి సోమాయామితతేజసే
గుత్తిదుర్గాధిదేరాజ్యే కోడూరాఖ్యమహితలే
పెనుమాగాణి విఖ్యాతం సర్వసస్యపశోభితం.
కోమాడు నాగమల్లాఖ్య దిన్నాభ్యాం అపి‥ప్రమం
గ్రామోత్తమావ్వలంకూరోః ప్రాచ్యాందిశిసమన్వితం.
ఊరచింతలనామ్నశ్చ గ్రామాదక్షిణసంస్థితం
వంగనూరాబ్రడతలాభ్యాం ఉత్తరాశాముపశ్రుతాం.
పినాకినీతటేపంచాకలదిన్నాహ్వయంపురా
బుక్కరాయపురాఖ్యాత ప్రతినామ్నాచశోభితం
నిధినిక్షేపసంయుక్తం జలపాషాణసంయుతం
అక్షీణ్యాగామిసహితం సిద్ధసాధ్యసమన్వితం.
అష్టభోగమిదంసర్వ స్వామ్యవాచంద్రతారకం
సహిరణ్యపయోధారా పూర్వకంసత్తవాన్ముదా.
శ్రీమాన్ నాచన సోమాఖ్య మహాకవి వరోప్యధః
రాజానమాసీ త్సైవ చిరజీవి ధనత్విరి.
స్వయంఅన్యకోద్వృత్తం దశోత్తరశతంకవిః
ఎడ్వింశ చ్ఛత్ర భాగాస్సర్వజమానః వ్యయస్తరః.

... ... ... ...

ఇదమఖిల రాజశేఖర
మధుకరఘుంకార గీతమాహాత్మ్యం.
శ్రీమద్బుక్క రాజేంద్రనృపతే
శాసన మచరైక పారిజాతస్య.
అత్రేయాణాం యాజుషః కోటికేవా

రాధ్యైచార్యస్సంగజో మాధమూర్తిః.
చక్రే సమ్యక్ సర్వశాస్త్రప్రవీణః
శ్లోకానేతాన్ మల్లనారాధ్యవర్యః.
త్వష్ట్రైతచ్చాభ్యసనం స్వామిశాసనేననిర్మితం
శాసనాచార్యవర్యేణ నాగిదేవేనశిల్పినా.

## శ్రీ వి రూ పా క్ష.

ఈ పై శాసనమున " ఆపస్తంబసూత్రుఁడును, భారద్వాజగోత్రుఁడును, యజుశ్శాఖాబ్రాహ్మణుఁడును, నాచనవంశాంబుధిచంద్రుఁడును, సకలాగమవేదియును, అష్టాదశపురాణాభిజ్ఞాతార్థవేదియును, అష్టభాషాకవిత్వ శ్రీయుతుఁడును, విశేషించి మహాకవియు సకలాగమవేదియునగు సోమయాఖ్యునకు సంగమభూపాలుని తృతీయపుత్రుఁడును విద్యానగరాధిపతియునగు బుక్కరాయలు పంపాతటంబు నందలి భాస్కరక్షేత్రంబు నందుండిన శ్రీవిరూపాక్షస్వామి సన్నిధిని శాలివాహనశకము ౧౨౬౬ తారణ సంవత్సర చైత్ర శుద్ధ నాఁడు పినాకినీతటమునందలి బుక్కరాయ పురమను నామాంతరముగల పంచాశలదిన్నయను గ్రామము నగ్రహారముగా దానముచేసి ధారపోసెననియు, అంతట నమ్మహాకవి యమ్మహారాజును చిరంజీవియగునటుల నాశీర్వదించె" ననియుఁ జెప్పఁబడినది.

వం. సుబ్బారావుగారు తమకొక (కన్నడలిపి) శాసనము దొరికినటులును దాన,

అలంకృతశకస్యాబ్దే రసభునయనేందుభిః

అని యున్నటులును బ్రకటించినారు. దానివలన నీశాసనము శాలివాహనశకము ౧౨౧౬ పుట్టినదని యెన్నఁదగి యున్నది. వం. సుబ్బారావుగారు 'ఈవిషయమునకు సందియముచెంది వీరభద్రరావుగారి శాసనమునకుమూలముచూడఁగా దాన "రసాభ్రనయనేందుభిః" అని యున్నదఁట. దానింబట్టి శాలివాహనశకము ౧౨౦౬. అనఁగా ౧౨౮౪ క్రీస్తుశకమున నాశాసనము పుట్టినదని తెలుచున్నది.

వం. సుబ్బారావుగారీ విషయము ప్రకటించినతరువాతఁ జిలుకూరి వీరభద్రరావుగారు 'ఆంధ్రులచరిత్రమున మూఁడవభాగమును బ్రకటించి యున్నారు. దానఁగలదు:—

"గ్రంథాలయ సర్వస్వము యొక్క- ప్రథమసంచికలో నెల్లూరుపత్రికకంటె నాచన సోముఁడు పూర్వుఁడని నామిత్రులగు వంగూరు సుబ్బారావుగారు ప్రయత్నించిరిగాని వారి ప్రయాసమంతయును వ్యర్థము. ప్రోలయ వేమారెడ్డి ౧౩౨౪ మొదలుకొని ౧౩౫౧ వఱకుఁ బరిపాలనము చేసినవాఁడు. తదాస్థానకవియె శంభుదాసునామాంతరముకల యెఱ్ఱాప్రగడ. బుక్కరాయలు ౧౩౩౬ మొదలుకొని ౧౩౭౭ వఱకును నున్నవాఁడు గావునను ౧౩౪౪-౪౫ లో నాచన సోముఁడు బుక్కరాయల వలన గ్రామములను దానముపొందినవాఁడు గావునను వారిరువురును సమకాలికులని విస్పష్టమగుచుండఁగా సోముఁడు శంభుదాసునికంటెఁబూర్వుఁడని వాదింపఁదివురుట నేలపడిచి సాముచేయుట వంటిది."

ఈగ్రంథముచేఁ బై వం. సు. గారియూహ ఖండితమగు

చున్నది. ఏకుమళ్ళ అచ్యుతరావుగారు, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటము ౫-సంచి ౧౦-౧౧-౧౨ లో:—

ఇట్లుండ నిటీవల మ॥ రా॥ రా॥ శ్రీ వంగూరి సుబ్బారావు పంతులుగారు నాచన సోమనాథునిఁగూర్చి మఱియొక శాసనము వెలిపుచ్చిరి. తమశాసనమునకును వీరభద్రరావుగారి శాసనమునకు నించుక భేదమున్నదనియును తమశాసనమందు "రసాబ్ధినయనేందుభిః" యనుపాఠము కానవచ్చుచున్నదనియు వారు నుడివిరి. వారియభిప్రాయమును గుఱించి సువర్ణలేఖ తే 27-10-1914 ది సంచికను జూచిన సంపూర్ణముగాఁ దెలియును. వీరిపాఠమే నిజమైనచో నాచన సోమనాథకవి శా. శ. 1206 (క్రీ. శ. 1284 సం॥) నాఁటివాఁడగును. అనఁగా నెట్టాగ్రెగసె క్రీయన సుమారేఁబది సంవత్సరములు వెనుకటి వాఁడగును. ఈసిద్ధాంతమే స్థిరమైనయెడల బుక్కరాయలకును విద్యారణ్యులకును విద్యానిర్మాణమునకును జరిత్రకారులు నిర్ణయించిన కాలము తప్పగును. వీరందఱు సుమారేఁబది సంవత్సరములు వెనుకకుఁ బోవలసివచ్చును. సోమనాథకవియును వారిమార్గము నేయనుసరింపవలసియుండును. వేయేల విజయనగర రాజ్యోత్పత్తినిగుఱించి వ్రాసిన వ్రాఁతలన్నియుఁ బూర్తిగా మార్చుకొనవలసివచ్చును. కావున సుబ్బారావు పంతులుగారు ప్రకటించిన కాలనిర్ణయము తప్పని నిరసింపక పునర్విచారణీయమగు సంశయముగా భావింపవలసినదని నాయభిప్రాయము. సోమనాథకవియు విద్యారణ్యులవారును నెట్టాగ్రెగ్గె యుఁగొంచెము హెచ్చుతగ్గుగా సమకాలికులనియే నాయభిప్రాయము

అని వ్రాసియున్నారు. బుక్కరాయుని పై శాసనము పూర్తిగా నాలోచింపవలసియున్నది. కావున బుక్కరాయుని వంశము విచారింతము. ప్రాచీనలేఖమాలలోఁ బ్రకటింపఁబడిన కొన్నిశాసనములవలన వీరివంశమిట్లు తేర్పరింపనగును-




ప్రాచీన లేఖమాలలో రెండవ హరిహరరాయల శాసనములు రెండుకలవు. ఒకటి, శా. శ. ౧౩౧౭ ధాత సం|| మాఘ శు|| పూర్ణిమనాఁడును రెండవది, శా. శ ౧౩౨౧ ప్రమాదిసంవత్సరమునను అనఁగా క్రీ. శ. ౧౩౯౫—౧౩౯౯ సంవత్సరములలోను క్రమముగాఁబుట్టినవి. రెండవ సంగముని శాసనమొకటి కలదు. ఆశాసనము శా. శ. ౧౨౭౮ దుర్ముఖ సంవత్సరములోఁ బుట్టినది. అనఁగా, ౧౩౫౬ క్రీస్తు శకము. పై శాసనములకును నిశాసనమునకును సంవత్సర

ములు సరిపోవుచున్నవి. ౧౩౫౬ వ క్రీస్తు సంవత్సరము దుర్ముఖి సంవత్సరముకాఁగా హరిహరుని రెండవశాసనము (౧౩౯౯ సంవత్సరమునది ప్రమాది సంవత్సరమునఁబుట్టెగాన) యీసంవత్సరముల లెక్క సరిపోవుచున్నది. అదియటులుండె బుక్కరాయని ప్రక్కతశాసనము 'రసాభ్రనయనేందుభిః' 'రసర్తు నయనేందుభిః' అను రెండు పాఠముల చొప్పున నైనను ధారణ సంవత్సరములోఁబుట్టినది. ఈరెంటికి నడుమ వది యేండ్లు తేడాకావున సంవత్సరముల లెక్క తేడారాదు. క్రీస్తుశకము ౧౪౦౪ సంవత్సరముకాని ౧౩౪౪ సంవత్సరముకాని ధారణ సంవత్సరము. ఆలెక్కప్రకారము, లెక్కించుచు వచ్చిన రెండవ హరిహరుని శాసనములలో నుదాహరింపఁబడిన సంవత్సరములు సరిపోవుచున్నవి. 'రసాభ్రనయనేందుభిః' అను పాఠము చొప్పున నీశాసనము క్రీ. శ. ౧౪౦౪ సంవత్సరములోఁ బుట్టినదగుట బుక్కరాయలీకాలమునాఁటివాఁడనవలయును. ఈతనికొడుకు రెండవ హరిరాయలు క్రీ. శ. ౧౩౯౫–౯౯ లో శాసనములిచ్చినాఁడు కావున నాతఁడాకాలము నాఁటనుండవలయు. ఏరి యీశాసనముల వలన నూటఁబదునొకండేడుల విరామముకానఁబించుచున్నది. తండ్రికొడుకులకడుమ ౧౧౧ ఏడులు వ్యవధి యుండునా? మిగిలినవారి చరిత్రాంశముకూడ విరోధించును. ఇంతియకాక. మొదటి హరిహరరాయలు రాజ్యమునకు ౧౩౩౬—౩౭ లలో వచ్చినటులును ౧౩౫౫ లో మృతి

వసంత విలాసము రచించెనని వాడుకయున్నది. అప్పకవీయమున మూఁడవ యాశ్వాసమున, వసంతవిలాసములోనిదని

క. అత్తఱి విటనాగరికులు । చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి। ముత్తెపు ఝల్లరులతోడి బుట్టల కొమ్మల్

అనుపద్యము దాహరింపఁ బడినది. ఈపద్యమునై జయంతీ విలాసము లోనిదని (౮౦౧ పుట. చూ) శబ్దరత్నాకరము. కాని యీపద్యము నైజయంతీ విలాసములోఁ గానరాదు. ఇట్టిపద్యమే యెఱ్ఱాప్రెగ్గడ హరివంశములోఁ గానఁ నగు చున్నది-

క, అచ్చరలును సర్వజ్ఞుని। యిచ్చయెఱిఁగి కదిసి భక్తియొసఁగంగరయుం
జొచ్చలితగంధసలిలస। ముచ్చయములముంచిరాటముఖమున నెమ్మిన్

ఉత్త. భా. ఆ ౭—౮౯

సోముని యెఱ్ఱన పద్యములోం గొండఁ బోలుచున్నవి. పైపద్యము సోమునిదే యనుకొందును. కాని యీవసంతవిలాస మెచటను గాన వచ్చుట లేదు. అప్పకవీయమున నాయాశ్వాసముననే యాదిపురాణములోనిదని

మ. ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యాన కేళీసర
న్నికటానేకనవప్రదేశముల దైతేయేంద్ర కన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబు పైఁజల్ల ప
ర్వకబాణంబుల కెల్ల నెల్లయగు సౌభాగ్యంబు శోభిల్లఁగన్.

అనుపద్యముదాహరింపఁడినది. ఈ పద్యమే 'సౌభాగ్యంబులోనాడఁగన్' అని యుత్తరహరివంశమునఁ బంచమాశ్వాసమునఁ గలదు. హరివంశమునకు, ఆదిపురాణమను పేరున్నదో లేకయది వేఱుగ్రంథమో యెఱుఁగఁదగియున్నది.

పాఠభేదములు పెక్కులు కానుపించుటజేసి యిటులు మాఱి యుండవచ్చును. లేక గ్రంథములు వేఱువేఱయినను నొక గ్రంథములోఁ జెప్పికొన్న పద్యములు కొండొక గ్రంథములో ననువదించుట తిక్కనాదులలోఁగాన నగుచున్నది. కావున నీపద్యమును నట్లయినదని తలఁపవచ్చును. దీనివలన సోమనాథుఁడు వసంతవిలాసమునకు నాదిపురాణమునకుఁ గూడఁ గర్తయగుచున్నాఁడు. వానిసంగతి భవిష్యత్కాలమునఁ గాని యేఱుపఱపరాదు. సర్వలక్షణసారసంగ్రహమున 'సోముని వసంతవిలాసమునుండి' క. అంజెదవుగాక ...అను పద్యము, ౧౯—౪౭ పుటలందును, క॥ అత్తతవిటనాగరికులు...అనుపద్యము ౧౪౮ పుటయందును గొలఁది మాఱుపులతో నుదాహరింపఁబడినవి.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సేకరించి కూర్చిన ప్రబంధరత్నావళిలో వసంతవిలాసములోనిదని యీక్రిందిపద్యముదాహరింపఁబడినది.

శా. ప్రాలేయప్రతిసీరసేనఁ బటుపెట్టె చైత్రవసంతంబులన్
గాలాస్మీలితకోరకోత్కరపరాగప్రౌఢికోద్వాగ్నిఁగు
హాలాపానవిహారపారమహిమాహంకారదోస్సారులై
హేలాపల్లవహేతిఖండితమహాహేమంతసామంతులై.

కొన్ని ప్రకరణములలో నుత్తర హరివంశమునందు కొన్ని స్వల్పస్ఖాలిత్యములు గలవు. దానఁజేసి యీతఁడీ గ్రంథమును బాల్యమున విరచించి యుండవచ్చునని కొందును. ఉత్కృష్టకవి కవిత్వము బాల్యమునందునను నాతి తేరినది

గా నుండనగును. రాఁగల కవితాపరిపాకత నదిసూచింపఁ జాలియుండును. ఈవిషయము కాళిదాసుని ఋతుసంహారమునందును, దిక్కన నిర్వచనోత్తర రామాయణమునందును చక్కఁగాఁగాననగును. ఈవిషయమును గూర్చి యరవింద ఘోషుఁడు కర్మయోగియను తనపత్త్రికయందు వ్రాసినాఁడు. కావున సోమనాథకవి యగ్రహారమును బరిగ్రహించుటకు మున్నే యుత్తర హరివంశమును విరచించి యుండనగునని యూహింపనగును. ౧౩౪౪–౧౩౪౫ సంవత్సరములకు మున్నే యుత్తర హరివంశము విరచింపఁబడియెననితోఁచెడిని.

## ఎఱ్ఱాప్రెగడ హరివంశము.

వేమభూపాలుఁడు, క్రీ. శ. ౧౩౨౪ మొదలుకొని ౧౩౫౦ దాఁకఁ బరిపాలించిన వాఁడు కావునఁ దత్కవియగు సీతఁడును దత్సమకాలికుఁడు. వేముఁడు తనను సవినయంబుగా సర్చించి యిట్లనినాఁడఁట.

శా. నాతమ్ముండు ఘనుండు మల్లరఘునాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి యొలమిం జేపట్టి మాకిచ్చుటన్
జేతోమోదమెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతింబొందితి నింకనుంచనియనేఁ గావ్యామృతాస్వాదనన్.

పూర్వ. భా. ౧. ఆ.

కావున హరివంశరచనకు వెనుక రామాయణము విరచింపఁబడినది. నృసింహపురాణమునందు:—

ఉ. ఉన్నత సంస్కృతాది చతురోక్తపదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ నరణ్యపర్వశే

పోన్నయ మంత్రిభాసుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవి నాథులకెక్కిన భక్తి చెంపునన్.

౧. ఆ. ౧౭.

అని మాత్రముండుటచే నృసింహపురాణముకన్న మున్నే యరణ్యపర్వశేషము విరచింపఁబడియెనని తెలియాఁగును. పై రెండు గ్రంధములకుఁ గ్రింది రెండు గ్రంధములకుఁ బౌర్వాపర్యము తేలవలయును. చిలుకూరి వీరభద్రరావుగారు,

ఈమహాకవి తొలుత రామాయణమును పిమ్మట హరివంశమును రచియించి ప్రోలయ వేమారెడ్డి కంకితమును గావించెను. అనంతరము భారతారణ్య పర్వశేషమును రచియించి ప్రబంధ పరమేశ్వరుఁడన్న బిరుదమును బడసెను

అని చెప్పి దీని కుపోద్బలకముగా నృసింహపురాణము నందలి, 'ఉ॥ ఉన్నత సంస్కృతాది' యను పద్యము నుదాహరించిరి. ఇందలి మొదటిపాదమున రామాయణము ను సర్థము క్లిష్టముగా గోచరించుచున్నది. కాని హరివంశమునురచియించినట్లు తేలదు. కావునఁ దొలుత రామాయణమును నరణ్యపర్వశేషమును లేక యరణ్యపర్వశేషమును రామాయణమును బదంపడి నృసింహపురాణమును దరువాత హరివంశమును రచియించినాఁడని తెలియఁదగియున్నది. శా. 'నాతమ్ముండు'...అనుపద్యమున నృసింహపురాణము అరణ్యపర్వశేషముల ప్రసంగములేల లేవని శంకింపవగుఁగాని కవి కిచ్చవచ్చినఁ జెప్పికొనును. లేదేని మానును. ఇంతియకాక యీరెండు గ్రంథములు వేమునకు

సంబంధించినవి కావు; కాన వాని యుబుసు దానలేదు.

చదలవాడ మల్లయ్య:—

సీ. ప్రతిభతో నారణ్య పర్వశేషము జెప్పెఁ
గవులకుఁ జెవులపండువలు గాఁగ
నర్మిక భవువచో శైఖరిరామాయ
ణంబునాంధ్ర ప్రబంధంబుఁ జేసె
నారసింహుని పురాణమొనర్చె హరి మెచ్చి
సన్ను నెన్నఁడు చూచినాఁడవనఁగ
ప్రౌఢిమై హరివంశ భాగముల్ రెండును
రచియించె సభలందుఁ బ్రాజ్ఞులెన్న

ఆ. దురితహరుఁ బ్రబంధ పరమేశ్వరుని శివ
ల్వాపనిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ
డను నుతింప బ్రహ్మకును వశంబె.

అని చెప్పుటచేఁ గొందఱు ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన గ్రంథముల పౌర్వాపర్యమును పై పద్యములోని రీతిగాఁ దలంచుచున్నారు. పైనా యూహయు దీనితో నైక్యమగుచున్నది. కాని పద్యక్రమముననుసరించి కాలక్రమమును ననుసంధించుట లెస్సగాదు. ఇంకను నీవిషయము యోజింపవలసియున్నది.

పై యూహానుబట్టి యెఱ్ఱాప్రెగ్గడ తుట్టతుదకు అనఁగా పై మూఁడు గ్రంథములు విరచించినతరువాత హరివంశమును రచించియుండును. వేమారెడ్డిని వర్ణించిన పద్యముల వలన నాతఁడును బరిపూర్ణవయస్కుఁడని గ్రహింపనగునుగాన నాతని పరిపాలనా చరమవేళయందు అనగా క్రీ. శ. ౧౩౮౦

౧౩౫౦ సంవత్సరముల నడుమ విరచితమని యూహింతును.

పై నూహించిన యూహలవలన నాచన సోముని యుత్తర హరివంశమును జూచియే యెఱ్ఱాప్రెగడ హరివంశమును రచించి యుండును. ఈవిషయము సింకను రాద్ధాంతము చేయఁదగు ప్రమాణములు దొరకమి విరమించుచున్నాఁడను. నాచనసోముని యుత్తర హరివంశమును నెఱ్ఱాప్రెగడ హరివంశము నొకేతూఁకిఁ గ్రమక్రమముగాఁ జదువుచుఁ బోవఁగా సోమననే యెఱ్ఱన యనుకరించినటులు నాకుఁదోఁచినది. విద్యాస్నాతకులు సత్యమునకు నిశ్చయించులగుదురు గాక. అముద్రిత గ్రంథ చింతామణి యందలి చాటు పద్యములలో

ఉ. నాచనసోముఁడె..............................పై
శాచకులోద్భవుండయిన జక్కుల యెల్లయ రాచ వెంగనిన్
గాచిన వీరితల్లుల..............నన్నయ భట్టు..........
రాచకవిత్వబాధ పడరాదు పరాసురశింపు దైవమా!

అని యీతప్పుపద్యమొకటి కలదు. దీననేమేని యుపయుక్తమగు చరిత్రాంశముండెనేని విజ్ఞులు ఖ్యాపింతురుగాక!

## సోమనాథుఁడు నియోగిబ్రాహ్మణుఁడు.

ఆంధ్రరాష్ట్రమునకు, ఆంధ్రవాఙ్మయమునకును మహోపకారము చేకూర్చిన నియోగి బ్రాహ్మణ వంశములో నీతఁడు పుట్టువుచెందినటులు, ఆ యాయికవులవలనఁ దెలియుచున్నది. కొందఱీతని వైదికుఁడనఁ జూచుచున్నా

ఱుకాని.

"నాచిరాజునిసోము" అనిజగ్గకవియు

"నాచిరాజునిసోము" అని పినవీరనయు

"నాచిరాజు, సోము" అని కూ. తిమ్మకవియు

చ. ..."నాచిరాజుసో, మన...మత్కులచంద్రుల"

అని కోవెల గోపరాజును

కొండాడిన కతమున నీతఁడు నియోగియనియే వ్యక్తమగుచున్నది.

నాచిరాజనునతఁడు అమరకోశమునకుఁ గర్ణాటక భాషలో గొప్ప వ్యాఖ్యానమును రచించినటులు తెలియనగుచున్నది. ఆతఁడు ౧౩౦౦ క్రీస్తుశకమునాఁటివాఁడు. ఆతఁడే సోమనాథునితండ్రి యేమో పరిశీలింపవలసియున్నది. ఆతఁడు (౧) జైనుఁడనియుఁ గాననగుచున్నది. అంతమాత్రమున నతఁడితనికిఁ దండ్రిగాఁడనుకొనరాదు. ఆకాలమున నిచ్చవచ్చినటులు మతములు స్వీకరించుట యాచారముగా నున్నటులు పోలుపనయ్యెడిని గావున నిది విరోధింపదు. కర్ణాటకభాషాభిజ్ఞుల సాహాయ్యమున నిది పరిశీలింపఁదగియున్నది.



(1) See. Kanarese literature. P. 84. The heritage of India series.

ఈ పద్యము లాశ్రమవర్ణనపరిములు. పై పద్యమునం దున్న భావగాంభీర్యముక్రిందిపద్యమున లేదు. మొదటి పద్య మునసే పాదమునకాపాదము తీరిచిలేదు. నన్నపార్యుఁడు పద్యమును బదములతో సొగసుగాఁదీర్చఁ బ్రయత్నింపలేదు. భావమునకై పదములఁగొని తెచ్చి భావమెట్లోఁగునో పద ముల నారీతిఁబంపినాఁడు. సోముఁడు.

శ్రవణసుఖంబుగా సామగానంబులు సదివెడు శుకముల సదువు దగిలి కపిలకివిను చుండు కిరులు.

భావము వెంటఁ బదములెటులు పరువిడినవో ! సోముని పద్యములో చెక్కినటులెచటికచటికి విడిగి పేఁగులాడుచు న్నవి. పదములు భావమునకై వెదుకులాడుచున్నవి. మొ దటిపద్యమున.

కరికరశీతలచ్ఛాయఁ బచ్చికరాంబుకణముల చల్లనిగాడ్పుఁ బడి వానిఁజెంది సుఖంబున్న సింహములు.

అని యుక్తిసహముగా వర్ణింపఁబడియుండఁగా సోమన

హస్తిసైతివ్యాఘ్రవ్యాపంచాననంబు

అని వ్రాసినాఁడు. నన్నపార్యుని పద్యముఁజూచియే సోముఁడీ బదరికాశ్రమవర్ణన మొనరించియుండును. మొద టిపద్యము హేతువులచేఁ జెలఁగుచుండఁగా మిగులు పద్య ముల నట్టివేవియులేవు. ఆయాశ్రమంబుననుండు వృక్ష ములు గాలితాఁకుడుచేఁ బడిపోవుచుండఁగా వానికొనల నేనుఁగులు జడియకుండఁగఁ బట్టుకొనుచున్నవఁట. ఆ వే

నుఁగులెపుడును వానివదలఁగూడదు. వదలుపోనచట పర్ణ
శాలలన్నియు భగ్నములై పోవును. ఇట్టి వాత్యాహతిలోఁ జెట్లులే విశీర్ణములగుచున్నవని కవి యూహించుచుండఁగా నిఁకఁ బర్ణశాలలాఁగునా? "మహాగజాః పలాయన్తే మశకానాం తు కా కథా" యనికదా!

ఈశ్వరునిఁ బూజింపఁ దెచ్చికొని జాగరూకతతోఁ గ్రుచ్చిన పూలమాలికలపై వ్రాలు తుమ్మెదలఁ గ్రోఁతులు పోఁద్రోలుచున్నవఁట. పెంపుడుక్రోఁతులకంటె నీక్రోఁతులే బదరికాశ్రమమునఁ బర్ణశాలలోఁ దిరుగులాడుచున్నయవి. [illegible] మునిశక్తిచేఁ నాశ్రమమున శాశ్వతికవిరోధములుకల జంతువులొంటొండ స్నిగ్ధములై యున్నవని వ్రాసినాఁడు. ఈతఁడట్టి హేతువును వర్ణించినాఁడుకాఁడు. క్రోఁతుల కేమిటఁబట్టి మధుకరముల నావలికిఁద్రోల నుప్పినాచేనో! ఇది యిటుండఁ బూజార్థనియమితపుష్పమాలికలపైఁ దుమ్మెదలు మూఁగుట స్వాభావికమయినను ఈశ్వరునిఁ బూజించు పూవులయందు మధుకరములు మూఁగుట వానిని గ్రోఁతులు పోఁద్రోలుట అనియనుట యనౌచిత్యముగానున్నది. ఈవిషయము సన్నెచోడుఁడెటులు వ్రాసెనో చూతుఁడు.

సీ. మొనలావులించివాసన చల్లఁబసిగొని
లేఁజేటిగము లేఁగు లింపడుంచి
నెమ్మి నాళగొని వేచి సుడిరాయుతెమ్మెరలచేఁ
బాటెముపుప్పొడిపాలి వోవకుండఁ

దరణికూటమున మేయొరలి పద్మిని మేన
మొల తెంచు మధుమాస మొలుకకుండ
మేల్కనిగోమిని మెలఁగి మై మురిసిన
బోదిగొన్నయకరువు సెపటకుండఁ
గీ. దెలిసి జక్కనలొంటిఁ గలయుఁ దారు
కలకలంబున రేకులు గిపలకుండ
మున్న కొనినచ్చి గణికాస మూహితోడ
గిరిజపూజించెఁబసిఁడి తామరలవరదు.

కుమా-౩-౩౫౧

ఇంతియకాక దున్నపోతులు, కాదు, అడవిదున్నములు అవబృథస్నానపర్వంతె నిర్మలతకై కాసారములఁ గాపాను చున్నవఁట. అటువిమ్మటనవి యున్నియుఁ గాసారమునంత యుఁ దామె యవబృథస్నానమొనర్చి పాడుచేయుఁగాఁబోలు ఇటమీఁదఁ బందులువచ్చుచున్నవి. తిమతమ పర్ణశాలల దొడ్లలోఁ బెబ్బులుఁ నెవ్వరిపై దులోఁ బోరిక కాఁపు కాయు చుండెనఁట. ఇవన్నియుఁ గన్నులపండువై చెలువు మిగిలె నఁట. కవి మనకు బదరికాశ్రమమును మిషచే నెట్టిఘోరసం దర్శనముచేయించినాఁడు! ఇంతియకాక మూఁడునీసములు, కొండవీఁటిచేఁదార్లు సంలెటియొక వచనముచేతను బదరి కాశ్రమమును వర్ణించి కవి తృప్తిపడినాఁడు. తిక్కన విరాట పర్వమున సంస్కృతకవి సంప్రదాయానుసారముగా.

"ఎని వివేకరహితు వ్యాపయంబునుంబోలె పమాదూషితంబు ను వినగవనితాప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును, ఘోరాటవీ భాగంబునుంబోలె నిర్మనుష్యంబును—"

విరా-౨-౩౨౫

అని యొకవచనము వ్రాయఁగా నీతఁడును దానిననుసరించి చాలవచనములు వ్రాసినాఁడు. వానిలో నొక వచనమును నీయాశ్రమము పంచికొన్నది. చూడుఁడు.

వ. మఱియుం బదాశ్రీమంబు వలాహకంబునుం బోలెఁ గటకా
స్వపంబై కుంజరంబునుం బోలెఁ గుంభాషిరామంబై రంగస్థలంబునుం
బోలె శైలూషశతవ్యాప్తంబై యింద్రపదంబునుం బోలె నైరావతరుచి
రంబై తరుణీముఖంబునుం బోలెఁ దిలకవిరాజితంబై పరమయోగి హృద
యంబునుం బోలె మోక్షనిలయంబై పారావారంబునుం బోలె నమృ
తోత్పాదన స్థానంబై మహాభారతంబునుం బోలె శల్యపర్వసనాథం
బై గగనంబునుం బోలె ఋక్షగణసంకీర్ణంబై కర్ణపథంబునుం బోలె
శల్యాద్రిస్థలింబై వేదోక్తక్రతుసంగున ఋత్విమానవిభవాహితంబునుట
కుండగి రంభాప్రవర్ధన స్థానంబై యుత్కృష్టపుండరీకంబునుటకుం
డగి రాజీవదయనిధానంబై రామమానోహరంబునుటకుండగి వైదేహీ
కృత సంచితస్థానంబై పరిపుత్రవాజసికరంబునుటకుండగి సంతతాహ
వనీయమానమహిమంబై గంధర్వనివాసంబునుటకుండగి విష్ణుపదావన
మూలంబై వెండియు నొక్కచందంబున యుద్ధసిద్ధాంతసంశ్రయం బ
య్యును సజినవాసస్థితికంబై పుణ్యజనేశ్వరనివాసం బ
య్యును యమనియమాదివిశంకంబై సమిద్ధ్యానధురీణాసం
కులంబయ్యును నక్షమాలాభాతిశయంబై యొప్పు నప్పుండరీకాశ్రమంబు
తపస్యనంబున హృదయంబు ప్రియంబునం జెనంగొన సాయంతన
సమయంబున ౨-౧౧౦

ఈవచనములు బాణుఁడు మొదలయినవారిఁజూచి నేరిచి రచింపఁబడినవి. ఇట్టి వచనములు భావపుష్టి లేక శిరోవేదనాజనకములకుఁగాని కవితాకళ కెంతమాత్ర ముపయోగపడవు. ఆశ్రమములవర్ణించు ప్రతికవియు నీరీతినే వర్ణించుచున్నాఁడు.

పైనున్న పార్శ్వని పద్యమును గొంతకృత్రిమముగా నున్నది. ఆపద్యమునకు రెండు హేతువులు కలవు. మునిశక్తి వలన నటులుండుటొండు. గానము, గాఢ్పనాస, నెవ్వరియన్నము తినుట యనునవి మఱొండు. మునిశక్తియొక్కటుగాన నది తొలిహేతువు. మిగిలినవి రెండవ హేతువు. ప్రకృతిసిద్ధము కాఁదగు నీరెండవ హేతువుకంటెఁ బ్రథమహేతువునకే కవి యాధిక్యము తెచ్చిపెట్టినాఁడు. ఏలన ఆశ్రమ వ్యాసమువలన నాయాశ్రమపతి యాధిక్యము గూరుపవలయుఁగదా. దాన మునిశక్తికే గౌరవముకూరుపవలసిన గౌరవము కవికిఁగావలసివచ్చినది. దీనికి మాతృకలగు నిందుగల యీక్రింది శ్లోకములఁ జూతుము.

రవేర్మయూఖైరభితాపితో భృశం
విదహ్యమానః పథి తప్తపాంసుభిః.
అవాఙ్ముఖో జిహ్మగతిః శ్వసన్ముహుః
ఫణీ మయూరస్య తలే నిషీదతి. ౧౩
తృషామహాత్యా హతవిక్రమోద్యమః
శ్వసన్ముహుర్దూరవిదారితాననః.
న హన్త్యదూరేऽపి గజాన్మృగేశ్వరో
విలోలజిహ్వాశ్చలితాగ్రకేసరః. ౧౪
విశుష్కకంఠాహృత (సీ) శీకరాంభసో
గభస్తిభిర్భానుమతోऽనుతాపితాః.
ప్రవృద్ధతృష్ణోపహతా జలార్థినో
న దంతినః కేసరిణోऽపి బిభ్యతి. ౧౫
హుతాగ్నికల్పైః సవితుర్గభస్తిభిః
కలాపినః క్లాన్తశరీరచేతసః.

న భోగినం ఘ్నంతి సమీపవర్తినం
కలాపచక్రేషు నివేశితాననమ్. ౧౬

. . . . . .

వివస్వతా తీక్ష్ణతరాంశుమాలినా
సపంకతోయాత్సరసో౽భితాపితః
ఉత్ప్లుత్య భేకస్తృషితస్య భోగినః
ఫణాతపత్రస్య తలే నిషీదతి. ౧౮

. . . . . .

జ్వలత్ప్రభోద్భిన్నశిరోమణిప్రభో
విలోలజిహ్వాద్వయలీఢమారుతః
విషాగ్నిసూర్యాతపతాపితః ఫణీ
న హంతి మండూకకులం తృషాకులః. ౨౦

ఋతుసంహారము–౧–

ఈ భావములు కొంచెముగా స్వభావము నతిక్రమించుచున్నను బ్రకృతిగాఁ గూడ నుండవచ్చునని యొప్పింపఁగల శిల్పము వీనియందున్నది.

ఒక మంచివస్తువును గాని లేక తనకించిన యేవస్తువునైనఁగాని చూచినపుడు దాని ననుకరించుటయో దాని కెక్కుడుగాఁ గూరుపనెంచుటయో మనుష్యునకు స్వాభావికము. ఆదికవులను దరువాతి కవులందఱనుకరించుచునే యుందురు. 'కవికులగురువ'గు కాళిదాసుఁడాదికవియగు వాల్మీకిని వ్యాసునిఁ బరిపూర్ణముగా ననుకరించినాఁడు. అనుకరించుటయే కాదు. వారి శ్లోకవాదములనే మాఁటికొన్నాఁడు. ఐననేమి? కూరుపునేరుపుచేఁ గ్రొత్తశ్లోకము లేయయినవి కాని ప్రాఁబడలేదు. ఒకే వర్ణన ననుకరించు వర్ణనలటులుండవల

యుఁగాని యనుకార్యమునకు సరిగానో కొలఁదిగానో యుండరాదు. సరిగానుండిన భావచౌర్యమందురు. కొలఁదిగానుండుచో నశక్తి తేటపడఁగలదు. కావున ననుకరణముల ననుకార్యములకంటె నధికరసము చిప్పిలు నటులు వ్రాయవలయును. నన్నయతిక్కనల ననుకరించినవారు చాలమంది కలరుగాని యాదికవుల తరువాతి వారెవరును ననుకార్యములోఁదులతూఁగునటులు వ్రాసినారుకారు. కావుననే యాదికవుల భువనోపజీవ్యులఁగా విమర్శకులు తలంచినారు. కవికంఠాభరణము నందు క్షేమేంద్రుఁడు వ్యాసభగవానుని భువనోపజీవ్యునిగా వక్కాణించినాఁడు.

శ్లో. ఇదంకవివరైస్సర్వైరాఖ్యాన ముపజీవ్యతే
ఉదయంప్రేప్సుభిర్భృత్యైరభిజాత ఇవేశ్వరః. (ద్వితీయః సంధిః)

అనుకరించుట చాలఁ బ్రాచీనకాలమునుండి వచ్చుచున్నది. వేదవాఙ్మయమునందే పెక్కులు చూపట్టుచున్నవి. క్రమముగా శ్రుత్యర్థమునే భాషాగ్రంథములలో ననువదించినారు. చూడుఁడు.

యదేతన్మండలం తపతి తన్మహదుక్థం తా ఋచః స ఋచాం లోకోఽథ యదేతదర్చిర్దీప్యతే తన్మహావ్రతం తాని సామాని స సామ్నాం లోకోఽథ య ఏష ఏతస్మిన్ మండలే పురుషః సోఽగ్ని స్తాని యజూంషి స యజుషాం లోకః సైషా త్రయ్యేవ విద్యా తపతి.

శ్లో. ఏతద్యన్మండలం ఖే తపతి దినకృత స్తా ఋచోఽర్చీంషి యాని
ద్యోతన్తే తాని సామాన్యయమపి పురుషో మండలేఽణుర్యజూంషి
ఏవం యం వేద వేదత్రితయమయమయం వేద వేదీ సమగ్రో
వర్గః స్వర్గాపవర్గప్రకృతి రవికృతిః సోఽస్తు సూర్యః శ్రియే వః

సూర్యశతకమ్

యథామమః—

హంహో స్నిగ్ధ సఖే వివేక! బహుభిః ప్రాప్తోఽసి పుణ్యైర్మయా
గంతవ్యం కతిచిద్దినాని భవతా నాస్మత్సకాశాత్ క్వచిత్
త్వత్సంగేన కరోమి జన్మమరణోచ్ఛేదం గృహీతత్వరః
కో జానాతి పునస్త్వయా సహ మమ స్యాద్వా న వా సంగమః.

ఇట్టు లుదాహరించికొనుటచే నితఁడనుకరణము నెంతయాదరించువాఁడో తెలియవగును (౧) కాని యనుకరణమంత మంచిది కాదు (౨) మన యీనాచిరాజుని సోమనాథుఁడును నన్నయభట్టారకు ననుసరించినాఁడు కాని శైలీ సౌందర్య మాత్రబద్ధుఁడై నెఱవేఱ్ప లేకపోయినాఁడు.

ప్రబంధానుకరణము.

పద్యముల ననుకరించినట్లులనే మనకవులలోఁ జాలమంది మధ్యకవులు, ఆధునికులును ప్రబంధమును సమగ్రముగా ననుకరించు నలవాటు పడినారు. ఇది సంస్కృత వాఙ్మయమునుండి జనించి యంటు జబ్బువలె వ్యాపించినది. నూతనప్రాంతు నిది చాలఁ బ్రకృతియే యయియున్నది. ఇంతియకాక మనలో నొకఁడొక వాణిజ్యముగాని వ్యాపారముగాని చేయుచో నెల్లరును ఆవాణిజ్యము నావ్యాపారము నాచరించి వారు పాడయి, ఆవాణిజ్యవ్యాపారముల నాచరించిన మొదటి వానినిఁగూడఁ బాడొనరించి దేశమును బాడునకుఁ దెచ్చుచున్నారు, తెచ్చినారును.

---

౧ తాలుకట్టనమున, ౩౧, ౩౨, ౩౩, పుటలుచూ ౨ కావ్యమీమాంస-౧౨ అధ్యా-చూ

రఘువంశకుమారసంభవములఁ గాళిదాసువ్రాయఁ గాఁ బెక్కులట్టివి పుట్టినవి. తరువాతఁ గొంతికాలమునకుఁ గొలఁది మాఱుపుతో భారవి కిరాతార్జునీయము వ్రాయఁ గా మాఘుఁడు దానికంటె బిగువుగా శిశుపాలవధమును వ్రాసినాఁడు. దానికంటె లవణిమొఱయు నటులు శ్రీహర్షుఁడు నైషధీయమును రచించినాఁడు. ఇటులొకే రీతిఁ గావ్యములఁ గొఱుకరాని కొఱములనుగాఁజేసి నైచుట భాషకు నంతస్స్థితినిఁగూరుచుటగాని మఱొండుకాదు. సంస్కృత వాఙ్మయమును మనము కన్నులారఁ జూచుచున్నారము. ఎటులనుండినదో యెఱిఁగినారము. ఇప్పటికిని పూర్వప్రబంధములనే యనుకరించు ననేకగ్రంథములు పుట్టుచున్నవి. ఇవి భాషకు నాశకములుగాక మఱింకేమగును. సంస్కృతవాఙ్మయము సర్వతోముఖవ్యాప్తము కావునఁ గావ్యగ్రంథములు కొన్నియిటులయినను, విజాతీయములగు గ్రంథములు వేనవేలుదయించినవి. నాటకములఁ దొలుదొలుత వీరశృంగారాది రసములలో భాసుఁడువ్రాసినాఁడు. ఆశృంగారరసమే మొనమొన్నటి వేంకటాధ్వరివఱకుఁ బెచ్చుపెఱిఁగినది. వీరరసము వట్టు వేణీసంహారములో సంతరించినది. కల్పన శూద్రకుని (౧) మృచ్ఛకటికములోఁ దుదముట్టినది. తరువాతఁ గొంతకాలమునకు వేదాంతనాటకమగు ప్రబోధచంద్రోదయము వెడలినది. దానితరువాత నట్టినాటకములనే

---

౧ భాసుని "దరిద్రచారుదత్తము" దీనికి మాతృకగాఁగానఁబడుచున్నది.

కములు విద్యాపరిణయము, భర్తృహరినిర్వేదము, సంకల్ప సూర్యోదయము చైతన్య చంద్రోదయము జీవానందము లోనగునవి వెలువడినవి. కాని యొకఁడేని క్రొత్త త్రోవఁ ద్రొక్కు స్వాతంత్ర్యము కలవాఁడుదయము నొందలేదు. ఇటులు భావ రసము పీల్వఁగా మిగిలిన చెఱకు పిప్పియయి పోయినది.

ఈరీతినే తెలుఁగు కవులును, పోయిన పోకై కవితాకళ ను బాముసకుఁదెచ్చినారు. ఆదికవులలో నీవ్యాధి యంత గా వ్యాపింపలేదు కాని మధ్యకవులలోను, ఆధునికులలో ను నపదూఱు వ్యాపించినటులు వ్యాప్తమయినది. తెలుఁ గు ప్రబంధములలో నొక ప్రబంధమును జూచినఁ జాలును. కొండొక ప్రబంధమును జూడనక్కఱలేదు.

మధ్యకవులలోను ఆధునిక కవులలోను జాలమంది క వులు ప్రబంధములు వ్రాసినను అయిదాఱుగంటలలోఁ దె లుఁగు ప్రబంధముల నన్నింటిని దెలియవచ్చునని చెప్ప వీ లుగాఁ జేసినారు. ఈప్రబంధములకు సంస్కృత కావ్యములే మాతృకలు. వానిలో శిశుపాల వధమును నైషధీయము ను ముఖ్యములు. ఇవి యాకాలమున మహాకావ్యములని మాఱుమ్రోఁగినవి. అందఱు వానినిఁబఠించుచుండిరి. లాక్ష ణికులందఱు పఠనపాఠనములలో నాదరించుఁ బడుచున్న కొన్ని మేలు గ్రంథములఁ జూచి తత్త ఛ్లోకములకు పరిపో

లు నటులుగా లక్షణముల రచించిరి. వానినిఁ జూచికవులం దఱును ఆయాయికావ్యములలోఁ గల వర్ణనల పట్టికల వ్రాసి పైచి యారీతినే తమతెలుఁగు కావ్యముల వెలయించినారు మనుచరిత్ర ప్రబంధములలో మొదటిది. తరువాతిది కవిక ర్ణరసాయనము. మొదటిదానికన్న రెండవది వర్ణనలలో గట్టి బిగిసినది. నాఁటినుండి నేఁటివఱకు నున్న ప్రబంధము లన్నియు నొక మార్గముననే పోయినవి. రసములలో శృంగారరసమును గొంచెమేని బెసకక మేఘుననుసరించు మెఱుపు వలె సంస్కృతకావ్యములలో వర్ణింపఁబడిన శృంగారరసమునే యనుసరించినది. కాని మిగులు రసముల మాట తెలుఁగు ప్రబంధములకుఁ దెలియఁదనినను దప్పులేదు. ఈరీతి మధ్యకవుల కాలమునుండి యాధునికకవుల వఱకు తెలుఁగు భాష ఒకే తిరుగలియందు నలిగి నలిగి జీవావశిష్టయై యున్నది. గొప్పకవులు కాఁదగు వారుకూడ సీదుస్థానుసరణము వలనఁ బోయినమార్గముననే పోయి పేరును మాపికొన్నారు. ఒకేబాటను బడిపోయినను అభినవరుచి పుట్టింపలేక పోవుటచే వారి పేరులు మాసిపోయినవి. మంచన తన కేయూరబాహుచరిత్రమున

> క. ఏరసమున నెవ్వఁడు ప్రియుఁ
> డారసమునయందుఁ బోల్చి యభినవరసవి
> స్తారము పుట్టించిన మును
> శేరినదెస విడిచి మనము సేరునవలతుఁ 1-36

అని వ్రాసినట్లు అభినవరుచివిస్తారము పుట్టించి మన

ములఁదమతమ కావ్యములకై మరలఁజేయుబడి గ్రంథము లుకాని మిగులునవి యేలయుపయోగించును?

కవితా నాశమునకు హేతువు

భాషానాశమునకు ముఖ్యమైన హేతువు దుష్టమగు ననుకరణమే. సంస్కృతవాఙ్మయమున మంచిగ్రంధములుండఁగా నాంధ్రకవులు విశృంఖలులై దుష్టమైన శృంగారమునే పాడు శైలినేయనుకరింపఁగా భాష కొంతచెట్టు పాడుకావుటకు బీజము. తరువాతఁ దెలుఁగు కవిత్వ మభివృద్ధిగాంచ మొద లుపెట్టినదాద అవిచ్ఛిన్నముగా ఒకకాలము ఆంధ్రు లనేలకుండుట ఎల్లప్పుడు తెలుఁగురాజులు తమలోనంతః కలహములఁ బెంచుకొని చేద్పుడుట తురుష్కులు ఒండయా త్రిలోనపెంచుట యీమొదలైన పెక్కుహేతువులచే నాం ధ్రకవిత్వము ఏకమార్గముఁబోయి నశింపవలసినదైనది. ఇంతియకాక, తెలుఁగు కంటె సంస్కృతమున కెక్కువ ప్రచారముండుట, తెలుఁగు పాత్రములలో మనసంఘము లు మొదలగువాని కుపయోగించు విషయములు లేకుండు ట అటులు లేనివానిని రాజులు శ్రద్ధలేక వారియుంపకుండు ట యివి యన్నియు హేతువులయియున్నవి. తెలుఁగుబా సలోనున్న కొన్నిశాసనములుకూడ నాగరలిపిలో వ్రాయఁ బడియుండుటచే నప్పటివారికిఁ దెలుఁగులిపిలోను నెంతయ నాదరముండెనో యూహింపవచ్చును. ఇంతియకాక సం స్కృత వైయాకరణ శిరోమణులలోఁ గొండఱు సంస్కృ

తోచ్చారణము పుణ్యజనకమనియు దేశభాషలకు నట్టిదిలే దనియు నభిప్రాయపడియున్నారు. (౧) ఈవిషయము విజ్ఞులు విశ్వసింపఁదగినదికాదు. యజ్ఞాదులలోనట్టి ప్రయోజనము మహాభాష్యమునఁ సూచింపఁబడ్డది. ఒకవేళ వారట్లన్నను అది సంస్కృతవాఙ్మయమునందలి వారికుండుఁ నభిమానము సూచించుననఁగాని నిక్కముకాదని తెలియఁదగియున్నది. నడుమనడుమఁగొందఱు కృష్ణదేవరాయాదులవంటి రాజుల కాలమునఁ గొంచెము కొంచెము తలయెత్తినను, మఱల వెంటనే రాచఱికమునకు బలము తగ్గఁగా నాదరించువారు లేమిఁ గవితకును బలముతగ్గవలసివచ్చినది. ఆయాకాలము లందలిరాజులును రాజభారమొకవంకఁగుదింపఁగా స్థైర్యము లేకపోవుటచేఁ దత్కాలమునందలి పండితులను సమావేశపఱచి విమర్శనముచేయించి యుండవలసినరీతిలోఁ గవిత్వమునుండకపోవుటయుఁ గవితాశిల్పమునకు నాధిక్యము చేకూరకుండుటకు బీజము. కృష్ణదేవరాయల కాలములో నైనను అతఁడంత విద్వత్ప్రభువయినను ఉత్కృష్టగ్రంథములుపుట్టలేదు. ఆదికవులలో నన్నయ తిక్కనాదులైన కవులైన నాచనసోముఁడు శ్రీనాథుఁడు మొదలగువారి నాధారపఱచుకొని వారుపోషించినట్లు రసముమాత్రము పోషింపలేక శైలీలంపటులై యెటులో ఆకాలమునందలి కొందఱుకవులు ప్రబంధములు తీరిచినారు. ఈప్రబంధములు చాలవఱకు

(౧) కౌండభట్టుని వైయాకరణభూషణసారములో శక్తి వాదమును, దాని వ్యాఖ్యానమునుచూ-

వర్ణనాభూయిష్ఠములై మూలకథ కుపయోగింపక ‘ఉప్పు పప్పుప్రసాదమునకు ప్రసాదముగా’ నున్నవి.

ఇటీవలివారు చాలమంది కృష్ణదేవరాయలకాలమునఁ దెలుఁగుభాష ప్రౌఢమైనదనియు నభిప్రాయ పడుచున్నారు. చూడుఁడు.

క. ఏనాఁటఁ గవిత్రితయము। నూనయుశ్శైథవమున నొప్పెఁ భువిలో
నానాఁట నాంధ్రభాషా। మానిని బాల్యంబుమీఱి మన్ననఁ గాంచెన్

అనివ్రాసియున్నారు. నాయుద్దేశము కృష్ణదేవరాయలకాలములోఁ గవితాశిల్పము విపులమాయెనది కాని తొట్లిబాల్యముపోయి, అనఁగా కొలఁదితనముపోయి బాల్యంబుమీఱి యనఁగా గొప్పతనము వచ్చెనదనికాదు. కవితాశిల్పము విపులమేయాయెనది కాని ప్రాచీనదశకంటె నాధిక్యముచేకూరలేదు. రామరాజభూషణుఁడు సత్యము వ్రాసినాఁడు చూడుఁడు-

సు. మహిమున్ . . .   . . . షన్-

నన్నయ, తిక్కన, శ్రీనాథుఁడు, సోముఁడు భాస్కరుఁడు నని ప్రాచీనకవులే యాంధ్రభాషకు మహోదయ మొసఁగూర్చెనని యభిప్రాయపడినాఁడు. కొందఱని యభివృద్ధియని చెప్పుచున్నారు. వారిమతమునను నదియలఁతి పెంపుకాని వలఁతికాదు.

(౧) పత్తనము బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు

(౧) నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనమ్
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవాః
విప్రలంభోవివాహశ్చకుమారోదయవర్ణనమ్

శూద్రులు ఏడుగురు గుత్తురుు కంటకము తరువాత రాజుగారు వేటకేగుట నాయికానువర్ణనము, రాజుగారికి లేకనాయకునకు మన్మథతాపముకలుగుట, నాయిక నాయకుని బొంచినామాదుట ఆమెకునురాగము కలుగుట ఆమె మన్మథావస్థలు తుదకెట్లో పిదికిసంఘటనము కలుగుట పుత్రోత్పత్తి పరిసమాప్తి. ఈరీతిని సామాన్యముగా ప్రబంధములో సంఘటింపఁబడియుండును. మొట్టమొదటఁ దిక్కన నిర్వచనోత్తరరామాయణము నందు బురాదివర్ణనము లు చేసి యున్నాఁడు. భోజమహారాజు వ్రాసిన రామాయణచంపువు ననంతభట్టుని భారతచంపువును జూచి తిక్కన పురాదివర్ణన మొనరించియుండును.

ఇతనికిఁ బూర్వులైన నన్నయ సోమనలు కథానిని బురాదివర్ణనలు చేయలేదు. ఇంకను బూర్వులెవరేనిఁజేసియున్నఁ జేసియుండవచ్చును తరువాతమంచనయొకఁడు తిక్కనరీతి ననుసరించినాఁడు. ఆదికవులుస్వతంత్రబుద్ధికలవారు కావుటచేఁబోయిన దారినిబోవు పెడబుద్ధివారికి అంతగా లేదు. మధ్యకవులన్నో పీఠిక లాది కథావిధానపరిసమాప్తి పర్యంతము ఒకరీతులు వ్రాసినఁదరువాతివారును నటులువ్రాయు ముచ్చిమి కలవారుపడినారు.

గద్యకావ్యము లావశ్యకములు.

భామకు గద్యము (వచనము) పద్యముకంటె సభివర్ధ

---

మంత్రదూత ప్రయాణాజినాయకాభ్యుదయాదయః
ఏతానియత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే.

కము. తెలుఁగుకవులు గద్యవిషయమై శ్రద్ధ కైకొన లేదు. రాజులచరిత్రములఁ వ్రాసినవారును ధనుశ్శాస్త్రముఁ వ్రాసినవారును ఇంకను వివిధవిషయముల విరచించినవారును పద్యములచేఁ దమగ్రంథముల నింపుకొనిరిగాని విషయమున్న కౌచితిఁబోషించు గద్యముల వ్రాసినవారుకారు. ఆదికవులలోఁ జాలఁగవులగద్యములఁజూతుము. ఎంతమనోరమములుగానుండునో విచారింపుఁడు. వారందఱు నేలా యొకగద్యకావ్యము విరచింపరో నెంత యానందముగా నుండెడిని. తిక్కనగద్యమును జూడుము. ఆతఁడట్టి గద్యమున నొకగ్రంథము వ్రాసియుండునేని యాతఁడువ్రాసిన భారతముకంటె నాగద్యకావ్యము ఆంధ్రలోకమునకెక్కుడు ఉపకరించునది. కేతనమహాకవి దశకుమారచరిత్రములోని వచనములుఁ గంతిరయే.

ఆతనివచనమును దీయనై యలరారుచున్నది.

నాచనసోముని వచనము పద్యమునంబలెఁ ప్రౌఢపదభూయిష్ఠమై శ్రీనాథునకు భిక్షపెట్టుచున్నది. మధ్యకవులలోను గొందఱు వచనమును బాగుగా వ్రాసియున్నారు. ఇట్టిగద్యకావ్యములులేమియు భాషను హీనావస్థకు రప్పించినది.

### అలంకారికులు.

మధ్యకవుల కాలమునాఁటికి అలంకారశాస్త్రమునకుఁ బరిపూర్తిగా నధికారము వచ్చినది. ఆ యలంకారశాస్త్ర

మును బ్రాచీనకావ్యనాటకములఁజూచి వ్రాయఁబడినది. అదిసమగ్రముగా నొకపుస్తకమేనిఁజూచి విమర్శముచేయదు. కాని మొత్తముమీఁద బుస్తకమునంతయు విమర్శించినట్లు లేకాని యదిసమగ్రముకాదు. లాక్షణికులు సామాన్యముగా గ్రంథము దుష్టమైనదయినను ఏకదేశముమంచిదైనచో నదిగొంచెము ఉదాహరించుస్వభావముకలవారు. దానిఁజూచి యాకావ్యమంతయు మంచిదనుకొని దాని నామూలాగ్రమనుకరించుటో నేమిప్రయోజనము? అప్పటికేఁగావ్యప్రకాశము దశరూపకము మొదలగు నవి ప్రసిద్ధములయియున్నవి. వారు వానిప్రకారము తమతమ ప్రబంధములఁ దీర్చియున్నారు. కావ్యప్రకాశాద్యలంకార గ్రంథములందుఁ జాలఁ దుచ్ఛశృంగారము కావ్యములనుండి నాటకములనుండి ఉదాహరింపఁబడినది.

క్రీస్తుశకము ౯ వశతాబ్దికిఁబూర్వము శృంగారతిలకమను నొక యలంకారగ్రంథము ప్రత్యేకముగా సంభోగవిప్రలంభశృంగారముల నుదాహరించునదిగాయున్నది. అందెంతతుచ్ఛశృంగారము ఉదాహృతమయినదో చూడఁదగు. తత్కర్త యగురుద్రకవి గ్రంథాంతమున

(౧) శృంగారతిలకో నామ గ్రంథో౽యం గ్రథితో మయా
వ్యుత్పత్తయే నిషేవన్తు కవయః కామినశ్చయే.

---

(౧) శృంగారతిలకమను నీశాస్త్రము నాచేఁ గూర్పఁబడినది. ఎవరు కవులో ఎవరు కాముకులో వారు వ్యుత్పత్తికలుగుకొఱకు సేవింతురుగాక. (కాముకులెందు వ్యుత్పత్తికలుగుకొఱకో ?)

అని చెప్పినాఁడు. కాముకులకుఁ బఠనీయమైనదని కవియే చెప్పినపుడెంత తుచ్ఛశృంగారమాకాలమునందలి వారు ప్రమాణముగా నంగీకరించుచున్నారో గమనింపుఁడు.

నాటకములలో నంతర్భాగములగు భాణములు ప్రహసనములు మొదలగువానినుండి నీచశృంగారరసపద్యములు కొన్ని యలంకారగ్రంథముల నుదాహరింపఁబడియున్నవి. సంస్కృతవాఙ్మయమున భాణములు ప్రహసనములును బహుబూతులతోఁ గూర్పఁబడియున్నవి. (౧) వానినన్నిటినిఁ బ్రమాణముగాఁ గైకొను నలంకారగ్రంథములు మఱికవులు పఠించి యించుమించుగా శృంగారరసవిషయము నల్లివ్రాసినారు.

శృంగారరసము

మంచిగ్రంథమైనకళాపూర్ణోదయమును ప్రభావతీప్రద్యుమ్నమును జూడుఁడు.

సీ పాలిండ్లుప్రియునెడ ... కళా

సీ. ఆటనెక్కెఁగరంబు ... ప్రభా-

ఆదికవులలో నింతవెఱ్ఱిలేదు. పూర్తిగాలేదనరాదుకాని కొంచెముగాఁగలదు. శ్రీనాథుఁడు పూర్తిగానేవ్రాసినాఁడు. ఆతనివంటివారల నొకరిద్దఱఁజూచి యాదికవులయందఱపై నీయపవాదమువేయరాదు. అది యటుండె. మహాకవియైన మంచనఁజూడుఁడు.

(౧) లటకమేలకము చూ.

గీ. వచ్చియాలి మానవతి నోరకన్నులఁ
జూచి బిట్ట బిల్లుసురతమునకు.
వేగపడిన— ” కేయూ–౨–౨౧౫

ఈ రీతిగా సందట్లుకొలఁదిగానో గొప్పగానో శృంగార రసవిషయమును సత్యాచారముచేసినారు. శృంగారరసము నెంతపవిత్రముగాఁ దీర్పవలయునో యంతకిమ్మడి పాపభూయిష్ఠముగాఁ దీరిచినారు. శృంగారమువర్ణించుటయనునది యొక ఘోరకర్మముగాఁ గానఁబడుచున్నది. అనాయక నాయికలు రాక్షసులుగాను మనుష్యులఁ జంపి తినువారివలెను పాపభూయిష్ఠులుగాను గానుపించెదరు. మిగిలిన రసముల నెటులవ్రాసిరో చూతమని మాకుము కుతూహలపడుచో మాకుతూహలము నిండువారెవరు? శృంగారేతరరసమును ప్రబంధములో వ్రాయు పాపమునఁ బోయినవాఁడొకఁడేని కానరాఁడు.

ఇట్టిరీతిగా భాషయవస్థపడుచుండఁగా నదియభివృద్ధినెటులు పొందఁగలదు? పింగళిసూరన యొకఁడు చాలస్వాతంత్ర్యముకలవాఁడున్నాఁడు కాని యీమహాసముద్రమును నాకొలఁది తీయనీ రేమిచేయఁగలదు? స్వతస్సిద్ధమైనదానితీయఁదనమును బోఁగొట్టుకొనకున్నఁజాలును.

సోముని యనుకరణాదులు.

మహాకవియగు నాచనసోముఁడిట్టిచటను దుష్టానుసరణ మొనర్చియుండలేదు. కుమారసంభవాదులలోని కొన్ని పద్యములవంటి పద్యము లుత్తరహరివంశమున నున్నవని

కొందఱు చెప్పుచున్నారుకాని యవి సాక్షాదనుకరణములు కావు. విషయైక్యము సంభవించినపుడు పద్యము లొకవిధముగాఁ గాఁబడుట సాజము. అట్టివే యొకటి రెండు నాచనసోముని కవితలోఁ గానవచ్చుచున్నవి. పాఠకమహాశయుల సందియముఁబోవుటకుఁ గొన్నిటినుదాహరించుచున్నాఁడ.

ఆ. వె. నగుఁడవీవు నేను నరభోజనుండ న
న్నెఱిఁగి యెఱిఁగి యిట్టు లీవు రాక
వేఁటకానియిల్లు వెదకకుండేలు
సొచ్చినట్టు లెలుక నచ్చితీవు

కుమా-౧౨-౮౬

క. మనుజాంగనలం బట్టుట
మనుజాలకుం జెల్లుఁగాక మనుజాంగనలన్
మనుజులు పట్టుటకును గొర!
కాని దే! "బెండులుమునింగి గుండులుతేలెన్."

ఉత్త-హరి-౧-౨౧౩

సీ. చిగురాకు కెంగేలి చెలిమి— నిర్వ-౮-౩౮
సీ. కిసలయంబులతోడి కెంగేలి— ఉత్త-హరి-౧-[illegible]

ఇట్టి వింకనుజూచుకొనునది. విషయము లేకమైనపోఁ బద్యములొకమాదిరిగా నుండుఁగాని యిట్టిది యనుకరణమనికాని భ్రముచ్చిమి యనికాని మననేరుపఱపరాదు.

(౧) గీ. ఉత్తముండుహితముచేసి యూరకుండు
మధ్యముండుహితముచేసి మాఱువెదకు
నధముఁడొరుచేయుహితమైన నడఁచిపుచ్చు
హితమునకు నెగ్గుచేయువాఁ డెవ్వఁడగును.

ఉ-హరి-౫-౨౯౪

---

(౧) ఏతేసత్పు-నీతిశ-చూ-౭౪

కొంటి' యనియుఁ గూర్చినాఁడు. వీనిలో మొదటిపద్యమున " మనసులోఁ గంటి; మానునంటి' యనిపాఠము కుదిరినది నికాని అర్థము అంతగాలేదు. 'భవములు మానునంటిన మనసులోఁ గంటి' యనుదానికి ననుప్రయుక్తమైనందు' నర్థస్ఫూర్తియుదయింపక, పాఠమంటినదికాని యర్థమంట లేదు. రెండవదానిలో 'విష్ణుఁ బొడఁగంటి; భవములు వీఁడు కొంటి' అను నియ్యది పాఠమును నర్థమును నంటి యున్నది.

ఇటులు చక్కనియనుప్రయోగముల చేతను స్వతంత్రములైన భావముల చేతను మంచి సామెతల చేతను నలరారి యుత్తరహరివంశము పండితజనాదరణీయమై రమ్యమైన ప్రబంధమనను నొప్పి యాంధ్రలోకమున మెప్పు వడసియున్నది.



# రెండవ విమర్శము.

నెల్లూరికవులు — రసములు — ఈరెండు శృంగారరసమును బోషించినరీతి — యుక్తిణి.

## నెల్లూరికవులు

నాచనసోమనాథమహాకవి సహజముగాఁ బ్రౌఢశైలిఁ పటుఁడయినను.

సాధ్యోహిరసస్యయథాలంకారవిధిః

అనిసన్నపార్యుఁడు వక్కాణించినటుల ఉత్తరహరివంశమును రసవంతముగా విరచించినాఁడు. నెల్లూరికవుల నాలుకలలోనే రసముప్పుట్టువ్వగాంచి యుండెనేమాయా పోయినదని నాతలంపు. కనుగొనుఁడు (1) తిక్కయజ్వ కేతన మహాకవి జక్కయ మారన నాచనసోమనాథమహాకవి ప్రబంధ పరమేశ్వరుండగు నేర్రాప్రగడ చెదలువాడ మల్లయ బయ్యన (2) అనంతామాత్యుఁడు పెద్దయామాత్యుఁడు (3) సిద్ధయ జన్నమంత్రి పిల్లలమర్రి పినవీరభద్రుఁడు:—

---

(1) ఈ కవులలోఁ గొందఱు పెన్నకు నుత్తరభాగమున వారని పోతనామాత్యకవిజీవితమున బ్రహ్మశ్రీ పెద్దిభొట్ల వీరయ్య బి. ఏ. బి. యల్. గారు వ్రాసినారు. (2) "అనంతామాత్యకవియొక్క తండ్రి కృష్ణజిల్లా శ్రీకాకుళములో నుండినటులను అతనితాత నెల్లూరులో నుండినటులను తెలియుచున్నది. ఇందువలన కవుల చలనపథమును నిర్ధారణచేయనగును' అని పోతనామాత్యకవిజీవితము (3) విక్రమార్కచరితము-౧-౮౮-చూ.

ఈ మొదలయిన మహాకవుల వాణిలోఁగాక యమృతము మఱియెచటఁగలదు ? పినాకినీనదీపూతమైన నెల్లూరి మండలమునందలి యమృతమే తత్కవీశుల వాక్యములనుండి నిస్సృతమై కర్ణపారణ మొనరించుచున్నది. ఆంధ్రలోకమున కంతయు నెల్లూరి మండలమే కవితాభిక్షపెట్టినది. ఇందఱ మహాకవులకు నివాసమైన నెల్లూరి మండలమును సందర్శన మొనరించి చొచ్చి త్రొక్క చూడవలయును. ఈ మండలమునఁ బుట్టి పెఱిఁగిన సోమనాథమహాకవి రసమును మనకుఁ జవిచూపకుండునా ?

రసము-౧.

ఎల్లరకు మునిమొదట భావములు సీమాతిగాములై యుద్రిక్తములునయి యుండుట నైసర్గికము. భావములు వారి కాలమును నాచారాదులను బుద్ధులను ననుసరించి యుండును. ఎవరికాలమునందలి యాచారములు వారినాగరకతలో సంతిఃపాతులు. ఈకాలమున నాగరకతగానున్న యాచారములుకొన్ని రాఁబోవువారికి నాగరకతగానుండక పోవచ్చును. అటులనే ప్రాచీనకాలమున నిండునాగరకత వహించిన చాల నాచారములు నేఁటికాలమున వారికివెగటుగాను నుండవచ్చును. మనుజుఁడు చుట్టుఁబ్రక్కలనుండు సంబంధముల కలయికచే నాయాయి తెఱఁగుల సంప్రదాయముల నలవరిచికొనును. శరీర వ్యాయామముచే నంగవికాసమును స్ఫుటముగా నొనరించుట భావముల వేగిరపాటుక్రియలయందుఁ గానుపింపఁజేయుట ఆకారగోపనమంత

గా లేకుండుట మొదలగునవి తొలుదొలుతటి గుణములు. ఇవి కాలాదుల సంబంధముచే మాఱుచుండును. ఆయా విషయము లాయాయి దేశములందుఁ దత్తత్కాలముల యందలి మంచి ప్రబంధములందుఁ బ్రతిబింబించియే యున్నవి. పరిసరములన్నియుఁ బరిపాకము నొందనిది కవితయుఁ బరిపక్వము కాదు.

నేటికాలపు విమర్శకులు తలంచునటులు శృంగారరసము పూర్వప్రబంధములం దెచటను చిత్రింపఁబడి యుండ లేదు. కొన్ని శతాబ్దులు కడచనినఁగాని జుగుప్సావహము కాని శృంగారరసము దయింపఁ జాలదు. అటులురచింప నేలగునో కాదో దుర్గ్రహమని కొందఱు తలంచుచున్నారు. ప్రాచీన కవితలయందు గొంపొకటఁ గొంపొకటఁ గొంచెకొంచెముగా [illegible]మయిన శృంగారరసము కానవగుచున్నది. శృంగారరసవిషయమున నాలంకారికు లందఱును చెప్పిన లక్షణ మేకగ్రీవముగా నున్నది. రాను రాను గొందఱు ఈవలివారు ముదురుతనమునను దమ వెగటుఁదనము చూపినారు. అయినను నది 'ఇదమిత్థమ'ని చూపఁజెప్పరాకున్నది. శృంగారరసమును శుద్ధముగా నావిష్కరించుట ప్రకృతపాత్రముల మీఁద నాధారపడియుండును. పాత్రములు నీచములయిన యెడల ముదురుఁదనమున కెరయగు చున్నటులు ప్రాచీన ప్రబంధములు సాక్ష్యమిచ్చు చున్నవి. కథయుఁగూరుపుకూడ మంచి చె

ములకు సహకారములు. మన యాంధ్రగ్రంథములన్ని
యు సంస్కృతభాషాగ్రంథముల కాంధ్రీకరణములు.
మూలమును జాలవట్టు అనుసరించి పోవలయు వీరు అందె
టులుండిన నిందటులు చొప్పింతురు. భావములు సమగ్ర
ముగా వీరివికావు. కావున నీకవులు శృంగారరసమును జాగు
ప్రవాహముగాఁ జిత్రించినారని గతానుగతికముగా మన
మను కొనుట భావికవులారీతి విచ్చలవిడిగా వ్రాయకుండు
ట కుపయు క్తమగుఁగాక.

రసములలో నెల్ల సర్వజనానుభూతమగుట శృం
గారరసము ప్రధానము. ఇతరరసాపేక్షచేఁ దీయనదై మే
లైన శృంగారరసమే రత్యాదిప్రకృతులచే సురనరతిర్య
క్సామాన్యముగా నెల్లర డెందములకు ముదమొదఁ గూరు
చుచున్నదని (౧)యానందాభినవగుప్తపాదాచార్యుల వారు
వ్రాసియున్నారు. ఇంతియకాక శృంగారరసమే రసమనియు

(౧) శృంగార ఏవ (ఏకో) మధురః ప్రహ్లాదనోరసః

ధ్వన్యా — చూ

శ్లో॥ వీరాద్భుతాదిషురసేషు రసప్రసిద్ధి
స్సిద్ధాకుతోఽపి వటయక్షవదావిభాతి
లోకేగతానుగతికత్వవశాదుపేతా
మేతాంనివర్తయితుమేష పరిశ్రమోనః
శ్లో॥ శృంగారవీరకరుణాద్భుతహాస్యరౌద్ర
బీభత్సవత్సల భయానక శాంతనామ్నః
ఆమ్నాసిషుర్దశరసానపరేవయంతు
శృంగారమేవరసనాద్రసమామనామ.

సరస్వతీ — శృంగారప్ర —

మిగిలినవి రసవ్యపదేశములనియు భోజరాజిట్లు చెప్పియు న్నాఁడు:—ఒకానొక మఱ్ఱిచెట్టు మీఁద యక్షగ్రహముం డెనని పలువురు వాకొనుటచే నా మఱ్ఱికి దయ్యాలమఱ్ఱి యని పేరువచ్చిన మాదిరిగా నెట్టులో వీరాద్భుతాదిరస ములందు రసప్రసిద్ధి సిద్ధించినది. గతానుగతికముగా వచ్చిన యీప్రసిద్ధిని మఱలించుటకు మాప్రయత్నము. రసమనఁగా నాస్వాదింపఁబడునది కావున సుఖాస్వాదరూపమగు శృంగా రమె యర్థము. సుఖమే యాస్వాద్యముగాన తద్రహితం బులగు నితరములకు రసత్వములేదు. రసములఁ దొమ్మిది గాఁ గొందఱు పదిగాఁ గొందఱు చెప్పినారు. మేము శృంగా రమునే రసమని తలంతుము. ఇటులే లౌకికులందఱు శృం గారరసమే ప్రధానమని తలంచియున్నారు. సామాన్యము గా జగత్తునకంతయు ననునిమేషము ననుభవములో నుం డుటయే శృంగారరస మధికమనుటలో బీజము. మఱకువ పొరగప్పియున్న కన్నులమూసికొని యొటుకతోఁ దలంచితి మేని శృంగారరసము తుచ్ఛమనియుఁ గేవలశాంతిరసమే యుత్తమమనియు మనకుఁ దెలియునదికాదు. మాఁడుఁడు సారిహారదీక్షితులెటులు చెప్పినాఁడో (౧)-"పెక్కు పుట్టుం

(౧) శ్లో॥ శృంగారాది రనేకజన్మమరణ శ్రేణీసమాసాదితై
రేణీపృక్ప్రముఖైస్స్వ దీపకసఖై రాలంబనైరర్జితః
అస్యైనక్షణికో రసః ప్రతిపలం పర్యస్తసైరస్యభూ
ర్బ్రహ్మాద్వైతసుఖాత్మకః పరమవిశ్రాంతో హి శాంతో రసః.
భక్త్వ-నిర్వా-౧-౨

జాడ్యులచేఁ బొందిన యాంత్రుపలోనగు వారిచేతను దనను బెంపొందించు చెలులచేతను ఆలంబనములచేతను గడింపఁ బడి, తుదకు వైరస్యమునకుఁగారణమై విస్పపాటులోఁ జేద్పను శృంగారము మొదలగు రసములున్నవి. కాని శాంతిరసమొకఁడే బ్రహ్మదైవ్ముఖాత్మకమై యెడ తెగని రసము" ఎవరికిచ్చవచ్చిన వారట్లుబ్రవాయుదురు. సర్వజనానుభూతమును అనుభూయమానమునగు శృంగా రరసమెక్కుడు ప్రచారముకలదికాని యదియె యుత్తమమని కొందఱనుచున్నారు. రసములన్నియు నట్టివ.

ఈతఁడు శృంగారరసమును బోషించినరీతి

ఇపుడు నాచనసోముఁడీ శృంగారరసమునెట్లు ప్రకటీకరిం చెనో మనమెఱుఁగవలసి యున్నారము. ఉత్తరహరివంశ మున ముఖ్యముగా మూఁడుచోటుల శృంగారరసముకాన వచ్చుచున్నది. మఱికొన్ని చోటులఁ గనుగొలఁదిగానున్నది శ్రీకృష్ణరుక్మిణీఘట్టము, ఊర్వశీనరకాసురఘట్టము, ఉషా నిరుద్ధఘట్టము. ఈ మూఁడును ముఖ్యములు. నరకునితో యుద్ధముచేయునపుడు సత్యభామను వర్ణించుచోటను గనుఁగొలఁదిగా శృంగారరసముకలదు. ముఖ్యములైన యీ మూఁడు చోటులును ఉత్తమ మధ్యమాధమములుగా నున్నవి.

రుక్మిణి

రుక్మిణీదేవి తనకుఁబుత్రునిమ్మని వేఁడుపట్టులనెంత పవి త్రముగా శృంగారరసము వెలుఁగొందుచున్నదో చూడుఁడు

రుక్మిణి నిశ్శబ్దసంచారిణి. పరమపవిత్రహృదయ. అతి శాంత. సీతాదేవికిపరావతారము. ఈభావమీతని సంవిధానమునందు స్ఫుటముగా మెఱయుచున్నది. రుక్మిణీసత్యభామలతోఁ గృష్ణభగవానుఁడు జూదమాడునపుడు రుక్మిణీసత్యభామల తారతమ్యమును గవియే తెలిపి యున్నాఁడు.

రుక్మిణీసత్యభామ లిరుకెలఁకులఁగొలువఁ గృష్ణుఁడు సత్యాముఖమునుజూచి నెత్తమాడుదమని కడఁగి ఓతరుణీ! నేనునీతో నెత్తమునాడునెడఁ బంతమునుగునో దెల్పుటకు రుక్మిణి కనుంగొనును; ఆనాతియు నేనునాడునెడ నీవు చూచుచుండుమనుటయు, వెంటనే సత్యభామ యిట్లుపలికినది.

గీ. వాదుఁగానితోఁడ వాఁగ్లినితోఁడను
బూతుతోఁడెఁదండిపోతుతోఁడ
నటమటీనితోఁడె నడియరితోఁడను
వెలకు నెత్తమాడ వెఱపుగాదు.

ఇట్లన్యాపదేశముగాఁ దిట్టె. యూరకుండినను మేలే. ఇంతియకాక మఱియు నిట్లనుచున్నది.

క. జూపరివి సుమాళివి నెఱ
వాదివి తసుకెరివి గెలువ వచ్చునె సత్యా
మోడఁనినుమాకనుటయు
నాకెఁదఁగనుఁగొనక పిలువును రాంబనతీ.

ఇట్లు తనదెస నుపేక్షచేసినను సరకుగొనక యామె సవతుల నందఱఁ దిట్టిపోయుచున్నది:—

క. కలిగనొక జాంబవతి వె
న్నెలవఁబడెడేల వలపు నీతలవేగా

బులియక వేసవతులుగల
పాలఁతుల కేపాటు వడకపోరావనుచుఁ.

ఇట్లనియుఁ జాలింపక కృష్ణునితో నెత్తమునాతోడ నాడనేరుపుగలవో నీవు నీపరివారసహితుఁడవై రావలసిన దనియు నొకటికిఁ బదాఱుచెల్లింతుననియు బొమ్మగట్టుదు ననియు నాడాఁకనెంకులకు ? తొలితొలిరుక్మిణితో నాడి గెలువుమనియు ననుచున్నది. కృష్ణుఁడు మాఱుపలుకక వచ్చిన కోపమును గన్నులఁగ్రోలినాఁడు. పైపెచ్చు నవ్వినాఁడు. రుక్మిణికేసిలిరిగి యాట మొదలుపెట్టినాఁడు. రుక్మిణిచాలఁ జతురతతోనాడినది. కృష్ణుఁడు చూచిచూచి మెటులో యంకించుకొని తానాడి ఆమె నోడించినను

సీ. చేయదుదుగుణంబు నెలవులేకుండిన
నెక్కినపలకఁ బోనిచ్చుఁగాని
పలుకదురోషించి పడనపాచి (సి) కలతో
నవదాయమైనను నాడుఁగాని
యొల్లదుగోపించి యొండునెత్తమునన్న
నచరంబునేర్పని యరయుఁగాని
నడుఁకదువంచించి నయమెక్కుడడిగిన
నిలుతెమింతటనన్న నిలుచుఁగాని
గీ. పలకనలుఁచుక బయిసుకి పల్లటిలక
బోఁటిదూఱక యాతొవుపుచ్చుమనక
యొంతలెక్కింపుమనక వ్రాయొక్కపెనక
తప్పనాపెక తొల్లింటిదారచెడక.

ఇట్లన్నది. ఇట్టియామెను సీతయేయనిన నేమిలోటు ? కావుననే ' రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని ' అని

యనుట సమంజసముగానున్నది.

పిదప సత్యభామయు శ్రీకృష్ణుఁడును నైత్రమాను చుండఁగా సోమన

సీ. ... ... ...
... ... ... యించుకంత

గీ. సాపడఁగ కుంటిన రుక్మిణి బొంకు బొంక
శౌరిఁ బలుమఱుఁ గెలిచె నా సత్యభామ. 3-౧-౭౮

అనుపద్యమున రుక్మిణిచే బొంకించినాఁడు. ఆమె పాద ముకంద్రైన బొంకునటులు నాకుఁదోఁచదు. ఇది కవి బొంకిన బొంకుగాని రుక్మిణి బొంకిన బొంకుగాదు.

శా. కంసారాతి మురామురాంతరకచక్రవ్యాపముఖ్యాసుర
ధ్వంసాపాదనపితకంటకవనిఁ ద్వారావతిఁ రుక్మిణీ
హంసీహంసమృణాళహారిభుజమస్యస్ఫారకాసారుఁడై
సంసారార్ణవసారమన్మథసుధాసారంబునం దేలఁగన్

సీ. యమునాతరంగడోలాధిరోహణమున
డంబుమీఱెడు మృణాలంబువోలె
హరినీలమణిమనోహరమందిరస్తంభ
ములవినోదించు కీల్బొమ్మవోలె
పలితనీలోత్పలవళిదామసంగతిఁ
గొమరారు సంపంగి గుత్తివోలెఁ
దరుణతమాల పాదపశిఖా శాఖలఁ
జెలువారు వలరాచచిలుకవోలెఁ

గీ. పారిజాతగోవర్ధనోత్పాటనమున
బలిమితోడైన మురవైరిబాహుయుగము
తెప్పఁగా మన్మథాంబుధిఁ దేలుచుండె
రమ్యగుణమణి రుక్మిణీరమణిప్రీతి.

ఇట్లువర్ణించినాఁడు.

సీ. అఖిలలోకైకనాథ నీయట్టి ధైర్య
వీర్యసౌందర్యశౌర్య వివేకనిలయు
నొకకుమారుని దయచేసి యుర్విలోనఁ
గడుపుచల్లని కాంతలఁ గలుపునన్ను.

అని రుక్మిణి యడిగినది. ఇచటఁగుమారునిచ్చుట యొక్క పండునో కాయనో యడిగి నటులుగాఁగవిమనకుఁ దోఁపఁ జేయుచున్నాఁడు. తదనుగుణముగాముందు శ్రీకృష్ణుఁడు పుత్రలాభార్థము తపస్సుచేయఁ గైలాసమునకరుగుచున్నాఁడు. ఇదిపౌరాణికగాథ. అదియటుండెపిదప రుక్మిణి కృష్ణునితో నీవునాకుఁబుత్రునీయవైతేని

క. మును రుక్మిణి పన్నడిగిన
దనుజాంతకుఁడే వరంబుఁ దప్పకయిచ్చుం
దనయుని నడిగిన నీఁడని
జనులాడఁగఁ జెవులు నేఁడు సంకటపడవే?

అని తను పెట్టవలసిన యాఁబడి యెఱుఁగనటులు లోకులమీఁదఁ బాఱవైచి,

క. కాఁచికొని కొడుకునడిగిన
టో, చనవున నాలుమగఁడటో, వరమిచ్చెం
జూచెదమను సవతులచే
నీచములకఁదనంబు చేరనీకుము కృష్ణా.

అని 'మగఁడు కొట్టినందులకుఁగాదుకాని తోడికోడలు నవ్వినందులకేడ్చినదను' సామెతను మాఱురీతిగా నతికినది. కవియెంత మనోహరముగాఁ బాలకుల నీసంభాషణలోముం

చి రసపరతంత్రులఁ గావించినాఁడో చూతముఁడు. మరల రుక్మిణి కృష్ణునితోఁ బ్రత్యక్షముగా మాటలాడుచున్నటులు గానఁబడుచున్నది. సంభాషణమున నీరీతిగాఁ దిక్కనయుఁ బింగళి సూరనయు రసపరతంత్రులఁ జేయఁగలరుగాని యన్యులకింతగాదు. తరువాత శ్రీకృష్ణుఁడు మోమున దరహాసము తొంగలింప నిట్లు పలుకుచున్నాఁడు:—

చ. ... ... ... ...
... ... ... ఓ।
వనజదళాక్షి! నీకుఁ బగవా! యిటులాడెద నన్ను నీవె వేఁ
డిన నిటుచేయకుండుట ఘటిల్లునె!

అని యొకవేళ సవతులు మెచ్చుకున్నేమాయె; ఇతరులు మెచ్చినఁ జాలునని నగము వ్యంగ్యముగా స్ఫురింపఁ జేయుచు.

ఉ. ... ... ... చేసిన నెవ్వరేని మె
చ్చని పని యేను జేయుదునె సంతసమందుము కోర్కిదీర్చ వేళ.

అని యింకను నామెకు నమ్మకము పుట్టింపనోయన

క. తన వలచు కాంతయే పని
మనమునఁ దలఁచినను జేయుమనగవానికిన
వ్వనిత బిగియార కౌఁగిలి
దినదినమును మదనకామధేనువు కాదే ?

అని యొప్పఁబలికినాఁడు.

సామాన్యముగా నందఱు స్త్రీలును దమకేదేని విశిష్ట వస్తువుకావలయు నపుడిటులుగదా భర్తలను నడుగుదురు. భర్తలుకూడ నిటులే ప్రత్యుత్తరము చెప్పుదురు. ఈ

రీతిఁ బాత్రపోషణ మెంతయు స్తుత్యమైయున్నది. ఈఘట్ట మున నీతఁడు వర్ణించిన శృంగారము దివ్యముగానున్నది.

## II

### నరకుఁడు–ఊర్వశి–తిక్క–నరీతి.

### నరకుఁడు–ఊర్వశి

నాచనసోముఁడీరీతినే 'నరకోర్వశీసంవాదమును' గొప్పగా వ్రాసినాఁడు. అయినను నచటవారి శృంగారరస యుక్తమగుసంభాషణముమధ్యమరీతిగానున్నది. ఈభాగము చాలనౌచిత్యముగా నున్నదని కొందఱును అధమముగా నుండెనని కొందఱును అభిప్రాయపడియున్నారు. 'లోకోభిన్నరుచిః' కదా. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథునకీయఁదగిన స్థానము' అను వ్యాసమున, నీభాగము చాలనౌచిత్యముగానున్న దనియు టేకుమళ్ళ అచ్యుతరావుగారు 'విజయనగర సామ్రాజ్యాంధ్రచరిత్రము' అనువ్యాసమున ఊర్వశీనరకాసురసంవాదమును బాత్రౌచిత్యకై యుదాహరించి యున్నారు. సహృదయుల కీరెండు వ్యాసములలోని భాగములఁజూపుట యుక్తమని యట్లొనర్తును.

"విజయమైనపిమ్మప స్వర్గలోక సింహాసనాసీనుఁడై నరకాసురుఁడు శృంగారముతో మునిగియున్న వీరమునకు సొంపుగలుగదని కాఁబోలు ఊర్వశిని బిలిపించి తన్నుఁబొందుమని కోరుచున్నాఁడు. మొదట నీకథ సంస్కృతహరివంశమున లేదు. హవిర్భాగములనిఁకమీఁద నింద్రునకీయక తనకే యీయవలయునని నరకాసురుఁడు మునులనుబట్టి పీడింపవలయును. లేకున్నవారు వోయి కృష్ణునితో దూఱుచెప్పుట

కలికిచూపులవీడ్కొన్న కన్నుఁగవయు
నింతమదిభీతి వెలుపలి కెలుకసేయ.

వచ్చినది. ఆయనను జూచి నరకాసురుఁడు తటాలున గాళిదాసుని రఘువంశములోని వర్ణనలఁ దలఁచుకొని "గేఁదంగి రేకు నఖంబునఁ జీలుట" మొదలగు శృంగారచేష్టలు చేయుచున్నాఁడు. సమయమునకు సరిగ స్వర్గలోకమున "గేఁదగి రేకు" దొరకుట చిత్రము అదిగని యూర్వశి "వాఁడు చేరి జాతాయత్తుండై తను బిలువం బుత్తెంచుట రోఁజేఁగి" లజ్జతో,

ఉ. తోరపుఁ జన్నుఁగోయి పయిఁ బొంగలి యుప్పలు దాఁటి చూపుల
వారము లేని క్రొమ్మెఱుఁగులై నిలువం గొలువల్లఁ జొచ్చియ
చ్చేరువ కంబముం గదిసి చిల్కను వోయన నిల్చియున్న గం
డాఁ పుబొమ్మ వోలె నచటం గదలించుక లేక యుండెఁ గన్.

ఆ లలితాంగిఁ జూచి నరకాసురుఁడు తన దిగ్విజయ విహారవార్తయెఁ జెప్పి యింతయున్నను సభలో "నీకనుదోయి వెన్నెలలు పక్కోరుల నాకునిండునే!" యని తియ్యని మాటలాడి "నా సర్వస్వమును నీకొప్పింతును నన్నుఁ గవయుము" మని వేడుకొన్నాఁడు. ఇంతవరకు నంతయు బాగుగ నున్నది గాని, యిఁక మీఁద వారి సల్లాపములు సౌమనస్యముగల స్త్రీపురుషులు నిండుసభలోఁ బలుకఁదగినవిగా నుండుటలేదు. "ఇంతకు ముందు నన్నొకనాఁడైన గోరియుంటివా?" అని యూర్వశి బదులుగా నాక్షేపించినది! దానికి నరకాసురుఁ డెంతయు మృదువున గౌరవముగ "వేఱుపని లేక వట్టి మిండతనంబుచేఁ దిక్కై నేను మీయూరికి వచ్చి నిన్నుఁ గోరవచ్చునా? ఇదియా మగతనమా? ఇట్టి లంజమాటలును గలవా?" యని బదులుపలికినాఁడు? ఏమి రసికశిఖామణి నరకాసురుఁడు! ఇఁక నూర్వశి తప్పించుకొన నెన్నియో యుక్తులు పన్నినది. "నేను లంజనైనను నీవు నన్నుఁ జెఱపట్టి తెచ్చుటచేఁ జిత్తమెల్లం జెడిపోయినది. రిత్త రాయిడ సేతురా?" యన్నది. "మవ్వపుఁ దీఁగెలం దెగడు స్వర్గము లెంకటో గలదు. నేను సంతనెన్నఁడో జవ్వనమమ్ము

కొన్నకపసాని" నని కోపముపుట్టించినది! ఏమన్న నేమి? ఇట్టిమాటలు జెప్పుటకు నూర్వశికి సిగ్గులేదు! ఇక నరకాసురునకో యంతకుమున్నె లేదు! అతఁడు బదులిచ్చు విధమువినుండు!

క. అంజెసవుగాక ననుఁ జెం। తం జేరఁగ నీకు నెంత తరిఁగిన మిరియా
లుం జొన్నల సరిపోవే। లంజెతనమునందుఁ గామినిలం గెలువనఁ లే

చూచితిరా! ఎంత తరిఁగినను మిరియాలు జొన్నలకుఁ దీసి పోవఁట! అట్లే యూర్వశి యెంతముసలి సానియైనను బాలియపు గన్నెలను లంజెతనమున గెలువఁజాలని వట. ఈసరసపుఁ బలుకులు వినఁగానే యావామలోచన చిలుకనగవుల అప్పలసిగ్గుదేర్చిన వట! సోముఁడు చూపిన ద్వివిధ శృంగారములో నిది మొదటిరీతి' రెండేపద్యము వ్రాసినను శంభుదాసుఁడు నరకాసురునియొక్కయు నూర్వశియొక్కయు స్వభావము నెంతగంభీరముగ వివరించినాడో తనశక్తినంతయు నుపయోగించి యెంతోశ్లాఘ్యముగ వ్రాసినవ సోముఁడు వారినెంత నీచాతినీచపాత్రములుగాఁ దోఁపఁజేసినాఁడో పరిశీలింపుఁడు! నరకాసురుఁ డెంతనీచుఁడైనను క్రూరాతిస్వభావుఁడగు రాక్షసుఁడని యొకవేళఁ దలంచినను, ఊర్వశి యెంతసిగ్గుమాలిన ముసలిసానియని యనుకొన్నను, వారిద్దరికిట్టి రసాభాసమగు సల్లాపము నిండు సభలో నడచియుండెదు. ఒకవేళ నడచి యుండవచ్చు ననుచో, కవి దానిట్లువ్రాయుట ప్రమాదము. ఇందుఁగల మింతటికము, లంజెతనము, మొదలగు పదములఁ దలఁచుకొన్న నెవ్వరికి రోఁత జనింపదు? కావ్యము సౌమనస్యప్రధానము. కావున స్వభావోక్తినే వర్ణింపఁదలఁచినవాఁడైనను, కవియా సౌమనస్యము పైముఖ్యముగ దృష్టి యుంచవలయును అట్లుగాదేని యుత్తమ పాత్రములందింత నీచ స్వభావముఁ జూపిన సోమునకంటె నీచపాత్రములకుఁ దగిన నీచస్వభావము నెంతయో సొగసుగ వర్ణించిన శుకసప్తతికారుఁడగు కదిరీపతినాయకుఁడు మహాకవియని చాలవలసియుండునుగదా! (నిజముగా నతని మహాకవిత్వమునందు బుద్ధిమంతు లెవరును సంశయింపరు.)

ఎక్కువ చాతుర్యము జూపబూనిన విపరీతమగుననుట కీఘట్టము ప్రథమోదాహరణము. (రా-అ-)

“ఇంక శృంగారరసకవన మీకవి నోటనె వినవలెను. ఔచిత్యనియమము మీరించుకయుఁ దప్పక, పేరునకైన నశ్లీలము చెంతఁబోక పాత్రపోషణము కడుఁ బ్రశస్తముగాఁ బరిపాటించుచుఁ గ్రమక్రమోదయముగ, రసోద్ధతిఁ బ్రకటించుచుఁ దుష్కృత్యాచారసాంఘ్యలోఁ బాఠకుల ముంచివేయును పాత్రోచిత భాషావిషయమున నూర్వశీ నరకాసురసంవాదము జూడుఁడు

క. పగవాఁడెట చేవేఁడుమ్రిఁదు
మగవా! నీవలని కొలువుపనినిడిచి నిం
దగపువడి పిలువఁ బనుచుట
మగతనమే? యిట్టులంగ మాటాడుగనే?

ఊర్వశి;

ఉ. అంతియుగ మనేను విను లావున నీవు రంమ్రిఁ దెప్పిన
న్నుం దెలవట్టు తెమ్మని ననో ముఁ దెసిపిగాని, చిత్తము
ల్లం దెడియుంప రిప్రియొసలం జవిచేరునె? చిక్కవోయిన
బంగరమేమి సేయు? రసభంగము సంగతిలోన మొప్పరే?

ఉ. నవ్వులు మాటలో నిజము నాకములోన ననేక కన్యకల్
మవ్వఁపుఁ దీఁగెలం దెగడు మానినులుండఁగ నంత నెన్నఁడో
జవ్వన మమ్ముకొన్న కడసానిననుం గవయం దలంచితే
పువ్వులు వేఁడుకైనఁ గడవోయిన వేళ ముడువంగ వచ్చునే?

నరకాసురుఁడు;

క. అందెపువ్వుగాఁ దనుఁ జెం
తం జేరఁగనీక యెంత తలఁగిన మిరియా
లుం బొన్నలు సరిపోవే!
అందెతనములందుఁ గొమ్మిరెలం గెలువవటే.

నరకాసురుని మోటుతనమును, ఊర్వశియొక్క చాతుర్యవిలసితభావగాంభీర్యము నెంత సమత్కారముగా వర్ణించినో చూడుడు.

టీ-అ

అనంత కృష్ణశర్మగారి వ్యాసము నవలోకించియే, నేను మళ్ళ అచ్యుతరావుగారు ఈవ్యాసమును వ్రాసియున్నారు ఐనను ఒకే విషయ మొకరికుపాదేయము మఱియొకరికనుపాదేయమునాయెను. రా-అ-గారు, ఊర్వశీనరకాసురులను ఉత్తమపాత్రములుగాఁ బరిగణించిరి కాని యది వాస్తవము కాదు. దానిఁజేసియే యీవిషయము తలకెక్కింపలేపోయినది. ఉత్తమపాత్రియొక వారాంగనను జెఱువట్టి తప్పింగమనా? ఊర్వశియు నుత్తమపాత్రము కాదు. ఐనను, ఆమెకు అతనియందు వలపులేదు. ఎట్లైనను దప్పుఁజూడవలయును. ఇట్టిపట్టున నుత్తమపాత్రమునకును నీగతియే పట్టును.

ద్రౌపది కీచకున కెట్లు చెప్పినదో విచారింపుడు.

క. మగలచేఁ గుపనుండక తమ
తగులముపాటింతు రెట్ల తగులంబైనన్
మగువల యొడలన యడఁగుం
బగవుడిచి యడచిపడరు ధైర్యము పేర్మిన్. ౨౬౧

ఆ. ఇట్టులగుటయెఱిఁగి యెల్లభంగులఁబహ
స్యంబు గోలుపోనియట్లుగాఁగ
నడచునీదుకోర్కి కనురూపమైనట్టిద
యట్టిభోగభంగి ననుభవింపు. ౨౬౨

విరా-౨ ఆ

లోలుతవిషయము గర్హ్యముకావున నేవమువోడము చున్నదికాని పాత్రములఁబోషించుటలో నంతపొరపాటు కానరాదు. టేకుమళ్ల అచ్యుతరావుగారు వ్రాసినంత యాచిత్యపుష్కలతయు లేదు. 'పేరునకైన నశ్లీలముచెంతఁ బోక' అని వ్రాసినారు కాని నిక్కవముకాదు. సీ. 'మను గుచూసిననైన మగువపిఱుందు సోయగము' అనునెడలను, మఱికొన్ని చోటులను స్వల్పముగా అశ్లీలదోషము కానగుచున్నది. ఎట్లైన యీభాగమును, రెండుపద్యములలో నెంతయు గంభీరముగ మధురముగ ముగించినాఁడని రా. అ. గారు తలంచుచున్నారు. ఇయ్యది సత్యముకాని 'వినూత్న విహారకరసాబ్ధిఁ దేల్చెదర్' అని యూర్వశి పల్కుటయు, 'మెచ్చులెసగాంగనీవింక న। న్నరవిందానన సత్కరింపుము మనోజానీక సంక్రీడలన్' అని నరకుఁడు పల్కుటయు నేమి సొబగుగానున్నది? ఎవఁడైనను, ఇట్టివిషయమును వాచ్యమొనర్చుచో జుగుప్సను బుట్టింపకమానఁడు. ఇట్టి విషయమును వ్రాయవలయు నపుడు కవి కుంచించి వ్రాయుట యుక్తము. పొడిగించుచోఁ బోషింపదుశ్శకము. విరాట్పర్వమున బాంచాలీకీచకసంవాదము విపులముగాఁ గలదు. కథాప్రాశస్త్యమునుబట్టియు నచట మనమునకంతగా జుగుప్స యుదయింపదు.

తిక్కన నిర్వచనోత్తరరామాయణమున రంభారావణసంవాదము, వారివిహారవర్ణనము, హారవిలాసమున

మేనకార్జునసంవాదమును, కంకంటి పాపరాజు నుత్తరరామా యణమున రంభారావణ సంవాదమును, శుకరంభాసంవాదము మొదలగునవి పెక్కు లిట్టి ఘట్టములు, ఆంధ్రవాఙ్మయమునఁ జూపట్టుచున్నవి కాని వానియన్నిటికి నిట్టిదూఱు తగులుచునేయున్నది. ఇట్టి సంభాషణములఁ బొడిగించి వ్రాయుటకంటెఁ గుంచించివ్రాయుటయుఁ బొడిగింపవలయునేని కడుజాగరూకతతో నౌచిత్యమెఱిఁగి వ్రాయుటయుఁ గవి తప్పక యెఱుంగవలయును.

నరకుఁడంత దీర్ఘముగా నూర్వశితో సంభాషించినను దననుబట్టి యౌచితిగానెయున్నది. అనేక స్త్రీలనేకవేణుల నెత్తికొని చనువానికి ముదిసరసములు సరసతా ప్రతిపాదకములేకానగును. ఐనను సంతిపొడిగించుట నీతికి బాహిరము. కావున నీ శృంగారమంతయు మధ్యమరీతిగానున్నదని యననగును.

## iii

ఇందుధరోపాఖ్యానము– శ్రీనాథుని శృంగారరసము–పిల్లలమఱ్ఱి పినవీరన–బుఱ్ఱపుబంతి– ఎఱ్ఱప్రెగడ యిందుధరోపాఖ్యానము–క్షేమేంద్రుఁడు– ఔచితి–జగన్నాథ పండితరాజు–మమ్మటుఁడు–సోముని జలవిహారము–ఎఱ్ఱాప్రెగడవారివిహారము–ఉషానిరుద్ధులు–ఉషాపాత్రోచితి–చిత్రరేఖ– చెలికత్తియలు–ఎఱ్ఱాప్రెగడ యుష; చిత్రరేఖ–సోముని యనిరుద్ధుఁడు–ఎఱ్ఱాప్రెగడ యనిరుద్ధుడు–సంవిధానము–కాలము.

### ఇందుధరోపాఖ్యానము.

ఇటులీ రెండుచోటులను ఉత్తమమధ్యమముగా

శృంగారరసమును దీరిచి యిందుధరోపాఖ్యానమున మూఁడు తోఁపింపఁదొడఁగినాఁడు.

ఈశ్వరుఁడు. పార్వతియు క్రీడోద్యానాదివిహారదేశము లందు దైతేయాప్సరో నికురుంబంబులతో విహరింపనేఁగి నారలఁట. అచ్చట

సీ. కిసలయంబులతోడఁ గెంగేలుపడఁబెట్టి
విరులపై నఖకాంతి విజ్జరాల్చి
తేఁటిఁగలకుఁ జనూలీల గానుకయిచ్చి
గుత్తులఁ జాలిండ్లు గొలిచిచూచి
చలిగాలి నిశ్వాస సౌరభంబులసాఁగి
యళిపఙ్క్తిఁ గురులతో నలుకఁగిర్చి
పుష్పాళ్లు నెలగంపములు వియ్యమందించి
పూఁదేనెఁ జెమటల బుజ్జగించి
గీ. తొడలు ననఁటికంబంబు మెడలుఁ బోఁక
బోదెలు నెలుంగులును బరపుష్టరుతులు
మాటలును గీరభాషలు మక్కళించి
చిగురుఁబోఁడులు వనకేళి చేయఁజేయ. ౫-౪౫

ఇటులు చేయఁజేయఁగా నొక్కర్తుక యేమోచేసి నవ్వి నది. ఇంకొకతె లతాసక్తచూచుకచేలాంచలయై మలంగి విడుమంచుఁ గేలుసాఁచినది. వేఱొకతె మొగము సగము వాంచినది. కొంతొకతె తలిరులు గోయుచున్నది. అపుడు

సీ. సుడిగొన్న చిగురాకు జొంపంబుగెంపారఁ
దలమీఁద మల్లికాదామమమరఁచి
నిడుఁదతామరతూఁడు నెట్టెంబు చుట్టిపైఁ
బటికంపుఁగడియంపుభాగమరిమి

తోనయ్యాక్రేవఁ గెందొనలను హత్తించు
మెసచక్కఁగస్తూరి మెదిచిపూసి
పాయనొమ్ములనల్ల పట్టుపగిల్చి య
కొన్న యాకుపై వెండికోరవెట్టె
గీ. ధవళకేతకీధూళి గాత్రమునఁ జలిచి
మోకమామిడికోకకాంత మ్రొక్కినిలిచి
యోషవిలోఁజక్కఁసగి ముదా కొసఁగుమనుడు
నద్రికన్యకతలవాంచె హరుఁడునవ్వె.

ఇట్లయిన తరువాతి నడపు తెలుఁగుమాటజతసము, అ పాంగవిలాసము, ముసుఁగువెట్టినమాదిరిమొగము, ఇంచుక వంచినసిగ్గు, ఇవన్నియుఁబార్వతినిఁదడఁబఱుపఁగా నీశ్వరునకు నాసపాటుగానడచు చిత్రరేఖయను నచ్చరనెచ్చెలులుకూడ వచ్చుచున్నారలఁట. అపుడు,

క. ఆదేవుఁడుతనసైఁబెపై గద్దంపుగప్పైలకన్యకనుఁగీటంగాఁ
బెస్తనడిసటించుచునస్ముఁయచిఱునగవుతోఁ బ్రమొక్కుచునిలిచెన్.
చ. నిలిచినచిత్రరేఖఁగని నీలగళుండు మొగంబువాంచినన్
గలకలనవ్వెసంబెక వికాసముతోఁ జెలికత్తెలింకసి
గ్గులపనిమానుమంచుఁబయి కొంగిడలింపనపొంగరోచులం
గలపెఁబురారి శైలసుత కన్నులవెన్నెలగాయుమించులన్.

ఇటులు వర్ణించినాఁడు. ఇదిహాలికుల శృంగారముగాని పవిత్రమయినదికాదు. పురాణదంపతులను శృంగారరసమునఁ జూనుపనెరాదు. వ్రాసితీరవలసివచ్చెనా వ్యంగ్యమర్యాదగా వ్రాయవలయును. లేదేనిమిగుల రసాభాసమునకు హేతువు.

### శ్రీనాధుని శృంగారరసము.

విశృంఖలుఁడైన శ్రీనాథుఁడునునింతకంటెఁ బచ్చిగా

నైషధమున వ్రాసియున్నాఁడు. ఆతఁడు శ్రీహర్షుననుసరించి
నవాఁడని చెప్పికొన్నను కావ్యోపసంహారమునందు,—'భట్ట
హర్ష మహాకవీశ్వరుండు కవికులాదృష్టాధ్వపాంథుం డొనర్చిన
నైషధశృంగారకావ్యప్రబంధవిశేషంబు నశేషమనిషిహృ
దయంగమంబుగా, శబ్దంబనుసరించియు నభిప్రాయంబు
గుఱించియుభావంబుపలక్షించియు రసంబుపోషించి యునలం
కారంబుభూషించియు నౌచిత్యంబాదరించియునన నౌచిత్యంబు
పరిహరించియు......' అనివ్రాసియు.

ఉ. అవ్వలి దిక్కు-మోమయి ప్రియంబున నొండులతోడ ముచ్చటల్
చ్రివ్వ మనోక్క-కోమలి పరాఙ్మనమున్నఁగ, ఘూర్ణుఁడొక్కరుం
డివ్వల వచ్చినంచన మెయిన్ సునునించు మెఱుంగుటద్దమున్
నవ్వుచుఁబట్టె దాని చరణంబులకున్నదు నైన మేదినిన్.

౬-౧౧౩

సీ. సర్వతోముఖపిపాసకుఁ దప్పినడియెదు
కామమోహనము నిక్కముగ వలయు.

... ... ... ...

గీ. అనుచు నెయ్యంపు వియ్యంపు నల్లసల్ల
సరసనర్మోక్తిఁ జాతుర్య సౌష్ఠవమున
గోష్ఠి సలిపిరి పమలోనఁ గొంతప్రొద్దు
భోజనాగారపర్యంతభూములందు.

౬-౧౧౮

చ. లలనయొకర్తు తగ్గు కృకలాసముఁ జేరఁగఁదెచ్చి, వంచనన్
నలునకుఁ గుంచెవట్టు నెలనాఁగపదద్వయమధ్యమంబునన్
నిలిపినఁగాలుఁ బ్రాఁకనది నీవియసీమకుఁ దోడిభామినుల్
గలకలనవ్వనూడ్చెనది గట్టినపుట్టముపాయశూన్యతన్.

శృంగార-నైష ౬-౧౧౧

అనియిటులు వ్రాసినాఁడు కసుమాలపుఁ దొత్తుల యిం
డ్లలలోనొడలెఱుఁగక నడచు శృంగారముగాని యిది సర్వ
సర్వంసహాపతిదైన నలుని యింట, అందును భోజనాగార
సీమల జరుగఁదగినదియా? ఇది శృంగారరసముకాదు. శృం
గారాభాసమంగముగాఁగల జుగుప్సారసము.

పిల్లలమఱ్ఱి పినవీరన — బువ్వపుబంతి.

ఈ బువ్వపుబంతినే వర్ణించుచుఁ బిల్లలమఱ్ఱి పినవీరన
యెంతయొాచితిఁబోషించినాఁడో యారయుఁడు.

సీ. చింపినపల్లవము లేచిగురుచేసెనె యనఁగావు
నెఱపైన కెంజివుందీఁగలుగాని
తెగినజండెము లేల తెచ్చెదరనఁగావు
వినుఁడివి సన్నసేవియలుగాని
యాదుంపకములసహ్యముగొల్పెననఁగావు
నమలి చూడుఁడు మోదకములుగాని
ఫేనపుంజము లేల పెట్టెదరనఁగావు
నీపావమాన ఫేనికలుగాని
తే. యంచువాచంయములు నవ్వ నబ్జముఖులు
నగుచు నొండొరులఁ జెప్పనందఱు నట్ల
ఱుచుల భుజియించి వార్చి కర్పూరవీటి
కాసుగంధప్రసూన సౌఖ్యములఁ గనిరి

జైమి. అశ్వ. ౩. ౨౦౪.

ఇచటఁ బురుషులు స్త్రీలతో నేమియుననలేదు. పురు
షులు తమలోఁదాము హాస్యములాడికొనుచున్నారు. అపు
డబ్జముఖులు నగుచు మండెఁగలనియు సేవియలనియు మో
దకములనియు ఫేనికలనియు నొడఁబడఁజెప్పఁగా వారలంద

ఱును యథేష్టరుచుల భుజియించినారు. శ్రీనాథుని యల్లరిని ఇంచుమించుగా సమకాలికుఁడుగాన పిసవీరన చేయింప లేకపోవఁడు. సమకాలికుఁడైనను అనౌచిత్యమని యెంచిన వాఁడువోలెఁ గడునుచితరీతిగా వ్రాసినాఁడు.

శృంగారరసమును అనుచితముగాఁ బెంచుట దాని నవమానించుటగాని పోషించుటకాదు. ఆపురాణదంపతులెంతపవిత్రులో వారి శృంగారరసమును నంతెపవిత్రముగా వ్రాయవలయును.

ఏతాపృగిష యిందుధరోపాఖ్యానము.

ఈ యిందుధరోపాఖ్యానమును వ్రాయుటయందేతాప్రగడయుఁ గొంచెము సీమాతిగామియైనాఁడు. కవిత్రయము తదితరులవలె నంతవిశృంఖలముకాదు గాని వారివర్ణనలును బరిపూర్తిగా నేటివిమర్శకానుగుణములుగానుండవు. ఏలనఁగా వారును బూర్వతరకవ్యనుయాయులే. అట్లని యంతగా శృంగారరసవిషయమయి దుష్టముగా విజృంభింతుకనరాదు. పుష్పాపచయకేళియందు ఎఱ్ఱన

మ. ఒకయేకాంతపుఁజోటఁ జంద్రమణివిద్యుత్సంగతల్పంబుపై
సకలేశుండు విచిత్రకేళికలనన్ శర్వాణిసంప్రీతగాఁ
బ్రకటప్రేమనిరూఢలీలవిహరింపం గోరియొక్కింతతదౌ
త్సుకుఁడయ్యెంగుసుమావకీర్ణమధుపస్తోమాభిరామాకృతిన్.

వ. అమ్మనోహరవిహారవిన్యాసంబునందు.

సీ. కంఠకాళిమ వనకంఠంబునకునూత్న
కస్తూరికాదీప్తి విస్తరింప
నాఁపలఁ జందురుఁ డమృతబిందులఁ దన
యలకలకీని పువ్వులనుదొడుగ
ననతంసనిశ్వాస మల్లనఁ బనయాన
తంసోత్పలమునకుత్కంప మొసఁగ
నంగదమణిదీప్తులలమి యొప్పగుతన
భుజములకాంతికిఁ బ్రోదిసేయఁ

గీ. గడెఁకఁగారమేశ్వరుఁడు కన్నుఁగొఁగిలింప
సరనికోద్ధృష్యపరసి నోలాడుచున్న
సునతర సద్రికవాకములన్ని
సంపనసురేంద్రుఁడూఁడు రంపారఁగనియె.

౭-౭౦

ఇట్టులు వర్ణించినాఁడు. మూలమున నీవర్ణనమేమియుఁ గానరాదు. నాచనసోముఁడు స్వతంత్రముగాఁ బొడిగించినాఁడు. ఎఱ్ఱాప్రెగడయాతని ననుకరించినాఁడు. లేనియెడలనీతనినే యాతఁడనుకరించెననుకొందము. సోమునిశిల్పము ఎఱ్ఱాప్రెగడశిల్పమును దులఁదూఁగుచున్నవి. ఒకదృష్టితోఁ జూచిన సోముని దెక్కుడుగానున్నది. మఱియొక దృష్టితోఁ గాంచిన యెఱ్ఱాప్రెగడది యెక్కుడుగానున్నది. కాని యౌచిత్యము చెడినది.

క్షేమేంద్రుఁడు-ఔచితి.

ఇట్టివిషయమునే సరిగా క్షేమేంద్రుఁడు తనయౌచిత్య విచారచర్చయందు.

(౧) ఊరుమూలనఖమార్గపఙ్క్తిభి-
స్తత్ క్షణంహృతవిలోచనో హరః
వాససః ప్రశిథిలస్య సంయమం
కుర్వతీం ప్రియతమా మవారయత్.

ఈ యంబికాసంభోగవర్ణనమునందు పామర స్త్రీలకుచితమైన సిగ్గులేమి గోగొత్తులచే నొప్పు పందొడల మొదలులచేఁ దనిసినకనులుకలవాఁడని భగవానుఁడు త్రిజగద్గురు వగుత్రిలోచనుని, వర్ణించుట వలనఁ బ్రబంధార్థమనుచితమని చెప్పినాఁడు.

జగన్నాథపండితరాజు.

(౨) జగన్నాథపండితరాయలురసగంగాధరమునందు- ప్రకృతివిపర్యయముదోసము. ఎట్లనినఁ గుమారసంభవమునం దుత్తమదేవతలయిన పార్వతీపరమేశ్వరుల శృంగారవర్ణనము. ఇది తలిదండ్రుల సంభోగవర్ణనమువలెనే కనుకనుచితమని వక్కాణింతురు.

అనివ్రాసినాఁడు.

---

(౧) అత్రాంబికాసంభోగవర్ణనే పామరనారీసముచితనిర్లజ్జసజ్జనఖరాజివిరాజితోరుమూలహృతవిలోచనత్వం త్రిలోచనస్య భగవతస్త్రిజగద్గురోః యదుక్తంతేన అనౌచిత్యమేవ పరంప్రబంధార్థః పుష్ణాతి.

(౨) "ప్రకృతివిపర్యయోదోషః॥ యథాకుమారసంభవే ఉత్తమదేవతయోఃపార్వతీపరమేశ్వరయోః సంభోగశృంగారవర్ణనం।ఇదం పిత్రోస్సంభోగవర్ణనమివ అత్యంతమనుచితమ్" ఇత్యాహుః

మమ్మటాచార్యుఁడు సంభోగరూపంబగు రతి ఉత్తమదేవతావిషయకంబుగా వర్ణింపరాదనియు సతీసంభోగవర్ణనము జననీజనకుల సంభోగవర్ణనమువలె నత్యంతమనుచితమనియుఁ గావ్యప్రకాశమున వివరించినాఁడు. ఇటులనే యాయాయుస్థలములందు ఆలంకారికులు ఇట్టి వర్ణన మంగీకరించియుండలేదు. ఈవర్ణనము క్షేమేంద్రుఁడుదాహరించిన కాళిదాసుని శ్లోకముకన్న మృదువుగానున్నను బాహ్యసంభోగవర్ణనమగుటచే ననౌచిత్యమునకుఁ గొంచెముగురియగుచున్నది. ఔచిత్యముపోషింపఁగవి ప్రయత్నింపవలయును. ఈయాలింగనాదులనే కొందఱొకరీతిగానుచితములుగను జేయనగును. అనౌచిత్యమునకంటెఁ గొండొకటి రసభంగమునకుఁ గారణముకాదు.

(౧) ఉపనిషత్తు బ్రహ్మము నెట్లు ప్రతిపాదించునో ఔచితియు రసము నట్లు ప్రతిపాదించునని జగన్నాథపండితరాయలు చెప్పినారు. ఈవిషయమును గవి మఱవఁగూడదు. మఱచెనా జుగుప్స పుట్టించును.

సోముని యుపహారము.

పినప నాచనసోముఁడుజలవిహారవర్ణన మొనరించినాఁడు.(౨)

---

(౧) అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా. రసగంగా-౪౨.పుట

(౨) నిర్వచనోత్తరరామాయణమునందలి సీతారాముల వారివిహారవర్ణనములోఁ బోల్చిచూడుఁడు.

చ. తరుణుల—౫—౫౯. మొసలు—ఉ—చెందొవ—వట్టు

ఈపద్యములలోను నచటనచటఁ గొంచెము శృంగార రసమెక్కుడుగా నున్నది.

ఏత్రాప్రెగడవారివిహారము.

ఈభాగమునే యనుకరించుచుఁ బ్రిబంధపరమేశ్వరుఁడగు నేత్రాప్రెగడ వింతరీతిగా జలవిహారమును వర్ణించినాఁడు. ఆతఁడు తరుణుల వీరమద్దియలతాఁకున సిరిని జిందఱవందఱఁజేయించి క్రొన్నిరువులతోడ నాఁచులు నూలుకొనఁగానిత్తింబసం క్తిపై విటులమాడ్కి విరిపూలను వీఁడిన యలకంబులను, దెఱఁగిపైఁబడఁజేయ నీయలేదు. జక్కవలజోడుల నెచటనో జోడుగాఁజేయలేదు. ముత్తియపుఁబేరు లనుదెగనీయలేదు. ఇవన్నియు సకలస్వాభావికములు. నావికుఁడొక. నావతేరఁగాఁబురాణదంపతులందెక్కినారు. అచ్చరలుకూడఁ జనినారు. వారు తెప్పిరివాహము నొరఁగాఁ బురాణదంపతులు సూచుచున్నారు. అచ్చరలట్లు తేఁకువలు లేని మాధుర్యమున విచ్చలవిడిగాఁ దిరుగుచున్నారు. అప్పుడు, పార్వతీపరమేశ్వరులును జలావగాహనమొనరించిరి

“ఉ. నావికనీతమైప్రథఘనస్థిరతంపనరాయ పోతముఁ
దేవియుఁదానునెక్కి శివదేవుఁడు దేవవధూవిధూతసం
భావితచానురానిలముపైఁ బొలయంగఁ దరీయకేళిలీ
లావిధిఁజూచుచుండె మృదులస్మిత దీప్తులమోమెలర్పఁగన్.

అప్పపద్మరేణువులట నొప్పమిగిలె
నభమునకుగంగసలిల విహారలీల.

తరు. అలరుపుప్పొడిపసుపార్చివ్రజాలహా
రంబమర్చికహ్లారంపు టేకు
లలకలసలికి కర్ణావతంసకమున
నభినవకేశరవంబర్పించి కేల
నెలతమ్మికేలిక్రై యిచ్చిరేఁ దేటి
యొసకపుటులివున నింపులువలికి
వెలితనంబునగంగ చెల్వపార్వతికిఁ
జేసెసత్కృతులెల్ల శ్రీసొంపు మెఱసి.

క. విజయాదిసఖీజనులును। త్రిజగన్నాథుండైన దేవదేవుఁగనకోత్సం
గజలంబులఁదేల్చిరి శై। లజకనుగీటంగఁ బ్రణయలాలసలీలన్.

క. అచ్చరలును సర్వజ్ఞుని। యిచ్చయెఱిఁగికడసి భక్తియొప్పఁగంగరయం
తోత్క్షిప్తలలితగంధసలిలస।ముచ్చయములు నించిరాప్రముఖమున నెమ్మిన్

వ. ఇవ్విధంబున వినోదించి సరత్ప్రవాహంబు వెలువడి విశ్వేశ్వరుండు హ్వావయేశ్వరియును దానును నభిమతనైపథ్యంబులు ధరియించి యలంకృతులైనగణపుంగవులు నంగనాసమూహంబులు పరివేష్టింపఁగొండొకసేపు గంధర్వాప్సరఃప్రయుక్తంబైన సరససంగీతంబవధరించి మధురావలోకనంబుల గృతార్థులఁజేసె నయ్యవసరంబున, ”

అని యెఱ్ఱాప్రెగడ రచించినాఁడు.

“నీరు ఎదలందు కస్తూరినిఁబోఁగొట్టఁగా గోరోత్తులు మెఱయుచున్నవి. కాటుకజిగిపిరివెలరారు కనుల కెంపులు లేమినొందినవి. తమ్మికెంపుపాయఁగా వాతెఱలయందుఁ బల్లొత్తులు కానుపించుచున్నవి. నుదురులందు బొట్టులు పోవఁగా నచటఁదడియుట చేలా వెక్కిన ముంగురులు

ముసురుకొనినవి. హస్తములయందును దోడలయందును స
న్నవలిపెములంటుకొనినవి. అసదుకొనుసందు నెత్తురు నిం
డారినది." ఎంతసౌహార్దముగానున్నది! ఎంతస్వభావసిద్ధము
గానున్నదో చూడుడు. న్యాసమొనరించిన నిటులుకదా
యుండును. నాచనసోముని శిల్పమునకన్నసీశిల్పమునప్రతిభ
మెక్కుడున్నది. అచటం బాంచాలీబంధము భావమునుమ్రింగి
వైచినది. ఎఱ్ఱాప్రెగడ కవితాశ్రానము పొండితికవన్నె
వెట్టుచున్నది.

పిదపం గౌతుకతోరణాతుండైన యీశుండు తనయోడడిగ్గి
ప్రియ కరముం గైకొని కౌతుకాగారముం బ్రవేశించినాఁడు.
అపుడు తలమీఁది యేటిపొంగలమించుతరఁగలు తాఁకను
చుండ సడలిననిడుదకెంజడలును ముసురుఁబండిన నాఁచుదీఁ
గలును బెనఁగొనుచుండ, నెలచందురుని క్రొత్తమెఱుఁగులు,
అంచతొక్కులయచ్చతెలుపుంగలయుఁబడగక్రొన్నెలుపు,
నింపగు పల్లకలువపువ్వుల పిందుడుయుఁజెలిమిసేయ, మేని
యందలిబూదిపొలుపుం గొప్పతి మఱుఁగులం దెలుపక్క
సడి. ఈశ్వరుడిమొగిచి వివాదకంకణపుయందు తమ్మిపు
ప్పొడికప్పిండ. అపుడు గంగ (ఊదకము) సవతియగు
పార్వతికి, పుప్పొడిపసుపార్చి మృణాలహారమమర్చి తెల్లకలు
వతేకుల నలకలఁజేసిచి కైరవమును గర్ణావతంసకముగా
సర్పించి చేతి కెలతమ్మినాట్లకై చొనఁగి లేఁదేటరవళియును
మిషచేనింపులుపలికె సాకతమిచ్చినది.

ఈ భావము లెంతమనోహరములుగానున్నవో విచారిం పుఁడు, జలవిహారమనఁగనే నీటిలోదూఁకుట, తామరలఁ ద్రెంపుట పద్మముల స్తనములందుంచుట, జక్కవదోయిని జనుదోయినిజేర్చుట, యొకరిమీఁద మఱియొకరు నీరుమి యుట వస్త్రములనూడఁదీయుట నీటిలో మునిఁగిపట్టుకొనుట యివిసాజముగాఁ దోఁచునవి, వర్ణించునవియును ఎట్టిన సాధారణకవికాఁడు. సంబంధములన్నియు విచారింపక పద్య ములవిసరఁడు. జలావగాహనమొ ర్చునది సార్వతీపరమేశ్వ రులు. ఈశ్వరునకు, జలమునకుఁగలసంబంధము గంగారూప ముగాఁ గనుఁగొన్నాఁడు. తనభార్యయగు గంగ, సవతికి, సత్కృతులుచేయునని యెఱిఁగి సత్కృతులుచేయించినాఁడు. ఇట్టి మనోహరమగుశిల్పము, ఇతరులకునోచరింపదు. గోచ రించుననుకొనినను, ఇంతరసపుష్టినెవ్వఁడు చేయలేఁడు. (కా వుననే నాచనసోమునకీవలివాఁడైనను) బ్రబంధపరమేశ్వరుఁ డగు నేత్రాప్రెగడ కవిత్రయానన్యత్వమును దనకుఁగూ రుచుకొనినాఁడు.

పిదప, "సర్వజ్ఞుని యిచ్ఛనెఱిఁగి యచ్చరలుకరయం త్రసమూహములచే గంధసలిలములనాటపేరుగా నెత్తిముం చినారు. అదియంతయునీశ్వరుఁడుచూచి వినోదించినాఁడు."

కల్పనయనిన నిట్లుండవలయును. ఈశ్వరుఁడు మనకిపు డీశ్వరుఁడుగాఁ గానఁబడుచున్నాఁడు. అంబికయంబగాఁగా

నుపించుచున్నది. శృంగారరసమును నిటులపవిత్రముగాఁ జిత్రింపవలయుఁగాని యింకొకమాదిరిగానగుచో జుగుప్సాకరమై రోఁతపుట్టించును.

నాచనసోముఁడు,—'కొలఁదితెరఁగలు, దూలులు,—అంబురుహము, మొగము—షట్పదములు, అలకములు—సుడి, పొక్కిలి—వేడుకచేయఁగా నెలఁతుక సంగడిచేఁ గమలి చదలంటు మిన్నునీరిపైఁ గొలిచి, జక్కవల జోడును, చనుగుబ్బల జోడుగా భవానిచేర్చెననియు, కరపంకజమున, నొకపంకజముంచి వదనపంకజమును బరిమళవశమున మోపుచు దొంతితామర చూపెననియు,' ఈశ్వరుని విషయమై.

చ. కరఁగిన పూఁతచేఁ గనకకందుకకాంతి వెలుంగుచున్నలం
చెరిగిన దొడ్డతుమ్మియపుఁ జేరుఁ వాయఁగ మన్మథాంకముల్
దరుణుల సంబికావిభుఁడు దార్కొనుచుఁ గను చాటుమాటుగా
దరఁగలుచిల్లికరవితానము మానసము గావఁ గందునే

యనియు వర్ణించినాఁడు. ఈవర్ణనము లాదిదంపతుల యెడ నెంతయనుచితములో పాఠకులెఱుంగకపోరు. ఎఱ్ఱాప్రెగ్గడయో, 'అచ్చరలు కరయంత్రసమూహముచే నాట నెపముగా గంధసారజలములనెత్తి ముంచినారు; ఈశ్వరుఁడీయాటనూచి వినోదించుచున్నాఁడు." అని పాత్రోచితి నెంతయు సేకరించినాఁడు. నాచనసోమనాథుని నెఱ్ఱాప్రెగ్గడయనుకరించినను, ననుకరింపనిరీతిని, ననుకార్యముకంటెను త్కృష్టముగను వ్రాసినాఁడు. జలములోఁ బోవునపుడు నావ

లేని యెడ నాతనికి బాఁగుగా లేదు అచట రసముఁ గనుఁ
బూర్తియుండదు కాఁబోలు. కావున నొకనావికుని చే నోడ
యొకఁడు తెప్పించినాఁడు దానిపై నాదిదంపతుల నెక్కించి
నాఁడు. పరిజనులంద ఱచేత వారికి వేఁడుకఁ బుట్టింపఁగాఁబోలు
నీటిలోనుంచి తేల్చి యాడించినాఁడు. అపూర్వముగా
సంబికి వారివిహారమునకు వచ్చుచున్నదని పసుపార్చుటలో
నుగాఁగల సత్కృతులను గంగచేఁజేయించినాఁడు. తరువాత
నచ్చరలు వసంతోత్సవము చేసికొనఁగా ఈశ్వరునివినో
దింపించినాఁడు. ఇచట వర్ణన యెంత సామగ్రిముగాను
న్నదో సోంవస జలకేళియందంత సామగ్రిలేదు. పినాకిని
నదిలో నేత్రంపెరిగడ కాలమునఁ బ్రభువులుగానున్న పెద్ద
నావలలోఁ బ్రయాణముచేసి యుండుటగాని యెందొకట
గానిచూచి మనము నాహ్లాదపడి యుప్పుడేని తాఁగూడ
వారితోనోకలమీఁదఁజని యనుభూతుఁడై యిటులు వర్ణిం
చియుండును. అటులాతఁడు వెళ్లియుండఁడేమోయని సం
కోచింతురేని కవితాప్రవాహమున నామహామహుఁడు పెద్ద
మోడమీఁదనే నేఁటికిఁబోవుచునే యున్నాఁడు. ముందును
బోవఁగలఁడు.

పినాకినీనదీజలంబున నేమి కొండొకటనేమి స్త్రీలుస్నా
నముచేయుచున్నపుడు పసుపార్చుట పండ్లాసఁగుట మొదల
యినవన్నియుఁజూచిగాని, లేక తానే పత్నీద్వితీయుఁడై స్నాన

మొనరించిగాని యీయనుభవము నెంతయుఁ జక్కఁగా నీనిఘంటువునఁ జిత్రించియుండును. ఇట్టిస్వాభావికవర్ణనము మఱియొకని కనుకరింపఁగారాదు. ఇఁక మనమీ పురాణ దంపతులనువడ్డ సెలవుగైకొని నవీనదంపతులగు నుషానిరుద్ధులఁ గాంచఁబోదము రండు.

ఉషానిరుద్ధులు

ఉషానిరుద్ధపరిణయమును మూలమునెంతవట్టు నాచన సోముఁడనుకరించెనో నాలుగవ విమర్శమున మీరు కాంచఁగలరు. ఈయుషాపరిణయమున కందుధరోపాఖ్యానము బీజము చూతుము.

"వ. మఱియును గొండలు తెమ్మెనలు పలు గొందిగుహలం గిలుకంతు కైవడి విహరించు నెమ్మనంబాని సుఖవిహారంబు విలాసంబునకు విలాసంబొసంగ నెసంగిన యాసహాయుచే నాసన్నసమాసీనయై బాణాసురకన్యయగు నుషాకాంత యిట్లని పలికెను

సీ. సల్లాపసరసు భాసారంబు చెవిఁగ్రోల్వఁ
జెలికత్తెఁ బుచ్చి మెచ్చింపువారు
నాసంపమకరంద మందంపుపైఁజింపఁ
గడకంటి చూపులఁ గప్పువారు
సురతాంబుబిందుముక్తావిభూషణములు
ప్రతిలంగఁజే చేతఁబట్టువారు
మఱపు మున్నిటిలో మానసంబులు దేల
ధ్రిగియారు కౌఁగిట బెరయువారు
గీ. బాలయలుకఁ బాసి తేల్చినఁ బొందువారుఁ
జతురతరవిహారంబులు సలుపువారుఁ
బ్రిథమ జన్మంబునందెంత భాగ్యవతులో
మగలుమన్నింపఁ జెంపారు మానవతులు.

వ. అనివిచారించి చెలికత్తెలతో వెడలనాడుటయును.

బీజత్వమునకుఁ దగునట్టులు పార్వతీపరమేశ్వర విహార వర్ణనము కొలఁది శ్లోకములలోఁ జక్కఁగా వర్ణింపఁబడియుండఁగా, నిందుధరోపాఖ్యానమని పేరుపెట్టి దానిఁ బెద్దకథచేసి వైచినాఁడు. కథ చదువుచుండఁగా నిందుధరోపాఖ్యాన మెంతకథయో యేమియోయని తోఁచును. ఈపద్యములు చదువుచోఁ గాయకన్నఁ దొడిమె యెక్కుడైనదని మనకుఁ దోఁపకపోదు, అదియటుండె.

తరువాతఁ జలికొండచూలగు పార్వతి విని 'ఇంతవం తఁకుబనియేం? మనోభవునిపట్టముగట్టుకొనసంగఁజాలుజాణఁ డగుమగనిఁ గవుంగిటనెల్లపుడు గొనియాడెదవు.' అనిబుజ్జగింప, నుమ 'మదీయవాంఛితము తెల్లముగా నోడఁగూడు నంటివెన్నఁడబ్బునో యాంతిమ్మనిన, నంబిక, 'రామను, ఓరా! (౧) వలరాచవేగిరమని సవ్వి యిటులన్నదఁట. "వైశాఖశుక్లపక్షంబునందు ద్వాదశీదినాంతవేళ, సౌధము మీఁద నిన్ను మదనకేళికిఁ గలలోన నెవ్వఁడు కదియునో యాతఁడు నీమగఁడగును." అనిచెప్పఁగావిని మనమున నున్న మనోరథ మొడఁగూడినట్టులు సంతసించినదఁట. ఇందులకై వచ్చినాఁడో యన నీశ్వరుఁడు ఉపాగిరిజాసంవాదానంతరమునఁ దమయావాసమునకుఁ బోయినాఁడఁట. ఎట్లైన యాతని ననుసరించినను, నిటులువ్రాయలేదు. పార్వతీపరమేశ్వరులు,

---

(౧) ఇట్లంబికయనుట యనౌచిత్యము.

ఉషకుగ్రామము ప్రస్థించుటకై వచ్చినటులు సోమనవ్రాత
లోఁగానుపించుచున్నది. అటులుండుటతగదు. వారివిహార
ము యాదృచ్ఛికము. దానివలన నుషకాయభిప్రాయము
తట్టినది. ఎట్టాప్రైగిడ, యీవిషయమును జక్కఁగా వ్రాసి
సినాఁడు సోముఁడు.

గీ. — అంబనసురేంద్రముకూఁతురింపాఁగనిరె.

క. కనకోర్వులంకరింపఁగ
మనసిజరాగమున ముగ్ధమానసమున నొ
య్యనఁబోఁగాకక్కఁగఁగన్నియ
తనమున నెంతయును భ్రాంతి తనుఁబొదివికొనన్.

వ. ఆత్మగతంబున . . . . . .

క. తగుమగనిఁబెనసి కౌఁగిట
సొగియుఁగనుటగాదె యరయజోటికినధికం
బగుభాగ్యఫలము నాకిం
పుగ నింకెన్నఁడొకో యిట్టి పోఁడిమిగలుగున్.

చ. జనకుఁడు మూఁడులోకముల సన్నుతికెక్కిన మేటిసంపదం
దనరినవాఁడు, మాకుఁగల దైవము పర్వతకన్య, కన్యనై
యొనసినభక్తిఁ గదిసియేఁ బరమేశ్వరి నాశ్రయించినన్
ననుఁగృపఁజూడకంబ కరుణానిధి యూరక యేలనుండెడున్.

గీ. అనితలంప రుద్రాణియయ్యబలతలఁపు
తనతలంపునఁ గనుఁగొని కనకరమునఁ
జిత్తమలరంగ నల్లనఁ జేరఁబిలిచి
యిట్టులనుఁ బన్నంబున కింపుమిగుల

ఇటుతర్వాతనే వారివిహారమును వర్ణించి యీశ్వరుని
యథేచ్ఛముగా స్వావాసమునకంపినాఁడు. నాచనసోముఁడు
జలకేళీమధ్యమునన్న పార్వతి యుషతో మాట్లాడి పంపి

నటులు వ్రాసినాఁడు. ఆజలకేళి యాఁగి కొంచెముసేపు ప్రసంగించి యావలికిఁ బంపివైచుట యంతబాఁగుగాలేదు. మఱలఁ గథ కలుపనెంచి యీక్రిందిపద్యముల వ్రాసినాఁడు.

క. వనకేళీజలకేళీ
   వినోదములఁ జేసి తనిసి వీణావేణు
   ధ్వనులును గాయకపాఠక
   నినాదములు వినుచుఁ దూర్యనిస్వనములతోన్.
వ. పురంబునకు మరల నానతి యిచ్చి నిర్గమించిన
క. దివసావసానమున భవ
   భవానులుం జెలులుఁ దురగభద్రేభరథా
   దివివిధయానములమరం
   దివిఁగొండలు నడువ నరుగుఁ దెంచిరి పురికిన్.

ఈయిద్దఱుకవుల కూరుపులలో నెఱ్ఱాప్రెగడదియే మేలుకూరుపుగా నున్నది.

ఉషాపాత్రోచితి.

పిదపఁ గొన్నినాళ్ళుగడఁచిన తర్వాత, నొకనాఁడుసూర్యుఁడస్తమించిన తరువాత మేడమీఁదఁజెలిపిందు మెందు కొనఁగా నేకాంతనిద్రలోనుండఁ గుమారుఁడొకఁడేమోచేసినాఁడఁట. అంతలేచి యుషనయనోద్వేగాశ్రుసిక్తాస్యయయినదఁట. ఎలుగెత్తి యేడ్చినదఁట. తనకుఁదొలుసమరతని శ్చైమైనదనిదురటిల్లునఁట. "కులమిటుదూషితమగునేచెలులు నగఁదవగుణంబుచే"నని వగచునఁట. ఈవిషయము నిటే క్రిందిపద్యముల రెంటిని వ్రాసినాఁడు.

శా. ఆత్రైతేయతనూజ నింగివడఁగా హర్మ్యంబుపై నొక్కనాఁ
డేదిక్కుం జెలికిండు మెండుకొనఁగా నేకాంత నిద్రాప్రవృత్తిన్
మోహింపంగలలోఁ గుమారుఁడొకఁడేమో చేసినన్ దాస్మరిం
పేర్మిన్ స్వప్నమేలుకాంచి నయనోద్గాఢాశ్రుసిక్తాస్యయై.

క. ఎలుఁగెత్తి యేడ్చెఁ గనకుం
దొలుసమయపు నిక్కమైన దురపిల్లఁగనెరాం
కులమెఱుఁగు దూతమగునే
చెలులు నగింపసగుణంబుచేనని వగచున్.

తొల్లిఁ దాను పురాణదంపతులు విహరించుచుండఁ గం
దరగోళిముపడి సిగ్గువిడనాడి, తనకునట్టిపోఁడిమిపుట్టునా? యని
వాజాఖ విడిచి యుంబికచే

గీ. కన్నెగి నైశాఘకస్త్రిపత్రంబు నడంచ
గ్వావిదినాంతవేళ సౌఖ్యంబుమాన
మదన విశిఖలలోనఁ గాయుసమ్ము
నెవ్వఁడాతండు మగఁడు నెకంటునని న.

అని చెప్పఁబడిన యుషయేనా యీయమె? రాక్షసమహారాజ
కన్య కావున మఱచి యుండును. తనకామావస్థఁగూడ
మఱచు వారలుందురా? యుందురేమొ! ఉషయేయున్నది.
తనకామావస్థ మఱచిన యుష శృంగారరసమున కేమి యుప
యోగించును? మహారాజులబిడ్డలకు సహజముగా మదనా
వస్థ యుండదేమో! చెలులందఱుఁగూడి గోరంతలు కొండం
తలు చేయుదురేమో! అదెనిక్కమమే యగును. ఈమందమ
తియగు నుషకుఁగొంతసేపటికిఁ జిత్రరేఖయిటులు మనవి
చేసినది.

చ. ఎఱింగితి నీ తెఱంగు వినుమిందుముఖీ యొక నాఁడు మంచపుం
బఱపును గూడియుండఁగ సుధాకరశేఖరుకాంత నీమదిన్
నెఱసిన కోర్కెఁ దీర్పనొక నేర్పరి నీకలవచ్చు నంతకుం
బతియు నెవో దినంబును సుధాభవనంబునఁ బ్రొద్దుఁ జూపెఁగన్.

క. మఱచితిగాక లతాంగీ
కలకంఠునితోడ నాఁడు కాత్యాయని నీ
నెఱ నెఱిఁగినాఁడు చెప్పిన
తెఱఁగిది సమకూరె నింకఁ దిగులేమిటికిన్

అనియిటులు చిత్రరేఖ తెలుపఁగా నప్పాటి చిత్తంబున వాటంబయిన పరిభవాభిమానము విరిసినది. అపుడు కన్నీరు దుడిచికొని క్రొనలుసాఁగు కోర్కులు గులుకు తలంపులఁ దమ కంపుమొలకలు వొడమఁగ డమవడినలజ్జ కడకన్నులు బెర యనున్నదఁట. అప్పుడామెకు వెంటనే మదనావస్థలు చాల వట్టు కలిగినవి

మ. పరపయ్యెం బరిభోగవాంఛ పవనం బాలయ్యె నిద్రారుచుల్
పొరపయ్యెం బలుగాల్కి చింతనగపుం బ్రోవయ్యె నాలాపముల్
నెరపయ్యె న్మదనానలంబు వసన న్నెరయ్యె నాలేపముల్
సొరపయ్యెం బనువల్లి చాణసుతకున్ సోలింతలం బూలుచున్.

క. లోఁగిటికి రానిరూపము
కౌఁగిటికిన్ రాని పొందు గారింపంగా
మూఁగిన కుసుమశరంబుల
చేఁగఱకఱఁగందె నతివ చిత్తంబంతన్.

ఇటులు హృదయంబున మదనానలంబు గదురఁగాఁ జిత్రరేఖతో నామెయిటులు నొడువుచున్నది.

చ. ఉడిగి మపంగి నైమలచియున్న తఱింగలలోనఁ జేరని
క్రొడిమగవాఁడొకో యనుచుఁ గంపఁగ మేల్పొను చోనతండయి

స్థదాఁకనపుడే యనుభవించు నుష కలలోనుండి యులికిపడి లేచి తనయూలుప్రపోయినదని యెలుగెత్తియేడ్చి గోలపెట్టినది. 'మాతండ్రికొలువులో మానినీతిలకంబ! రమ్మను నా పేరువమ్ము వోము, 'సల్లపాల్లెలుఁగనినాకులంబను మంచి మచుఁగుఁ జీరకుఁజాలమైలపోఁకె, ఇఁక నేనుప్రాణాన నుండుట నమ్మకములేదు చెలిమి మఱవఁదలంపుము' అని వెక్కివెక్కి యేడ్చినది. ఇట్లు శీలభ్రంశముచేసెనని తలఁచు మాపమేశీలముచక్కఁజేయువలసివచ్చినది. ఇదియేముల్లు పుచ్చి క్రొడచిన చందము కాఁబోలు.

తనప్రాణముఁగూడఁ బరిహరించునంతటి శీలభ్రంశము చేసినవాఁడు, చిత్రరేఖ, 'మఱచితివి; అంబికనాఁడు చెప్పినమాట కిది తెత్తి' అని తెలివిడిచేయుగాఁ దలిసికొని వానియం దెక్కడలేని ప్రేముడిగొనుట యేమి సాజము? చిత్రరేఖ తెలిపినతరువాతఁ గలలోనిరూపము కన్న భిన్నరూపము కానుపించుచున్నదా? లేదు. ఆ రూపము, ఎట్టిదైనను దనను మొదటనే యాకర్షింపవలెను.. లేదా యుదాసీనముగా నుండవలయు. తరువాతఁబరిచితిచే ననురాగాదులఁ దాల్పవలయును. ఇది లోకస్థితికదా. ఇచట లోకవ్యత్యయము. కలలో నొకరూపము కానుపించినది. అది యేమోచేసినది. అంతటఁ గులముపాడై పోయినది. ప్రాణముకూడ వీఁడుదుననుకొన్నది. ఈ విషయమైనను లోపలనిముడుచుకొనలేక, చిత్రరేఖా! నాచెలిమి వినువవే

యని, బావురుమని యేడిచినది' ఔరా! బుద్ధి కెంత వేగిరము?
కవి యిచట సహజమైన తలంపుల నెలువరించినాఁడు కాఁడు.
పాత్రకు సంబంధించిన విషయము నాముఖ్యముగాఁ దల
కించి వ్రాసినాఁడు కాఁడు. ఏదేనొక విషయము పుట్టిన దాని
బెంపొందించుటయే కాని యెంతవఱకా విషయమును వ్రాసి
యుపసంహరింపవలయునో యెంతవఱకు పొడిగింపవలయునో
విచారించి మఱి వ్రాయువారికి కవికి నక్కఱ. ఈ విష
యమును బింగళి సూరనార్యుఁడు నశ్యకవులును, ఆది
కవులుగూడఁ గాలమును నెఱుంగరు. నాటకముల
వ్రాయు కవులకీ గుణము చాలనెక్కువగానుండును. మృచ్ఛ
కటికము వ్రాసిన శూద్రకుఁడీ విషయమును బాఁగుగా నెఱిఁగి
యున్నాఁడు. వసంతసేనయు మదనికయు శర్విలకుని సందర్భ
మున మాటలాడునపుడును మైత్రేయుఁడు మాటలాడు
నపుడును దక్కువ యెక్కువలు బాఁగుగా వ్రాసినాఁడు. శకార
పాత్ర మెక్కువగా మాటలాడవలయునది. ఆ విషయ మధి
కరణమున నా పాత్ర మాటలాడునపుడును, చారుదత్తుని విడఁ
దలఁపఁగోరువారి సంభాషించునపుడును జాగరూకతతోఁ
జూచు నెడలఁ దెలియఁగలదు. ఇట్టివాఁడు మాఘుఁ డొకఁడు
కలఁడు కాని యాతఁడు విశేషణములను విశేష్యములను
గొలఁది పదములనైనను బెక్కుపదములనైనను జెప్ప
నతిసమర్థుఁడు. అట్టివారు తెలుఁగుకవులలో నరిది. అది
యటుండె.

'కలలోఁ గానఁబడినవాఁడెవఁడో చెప్పలేక యుమ, వెచ్చనికన్నీరు, ఎదపై జాఱ మెయిని మ్రానుపాటు ఎలుఁగున రాలుపాటు నొందన వివర్ణయైనది. ఇట్లు కందిన పువ్వు వలె విరహాముచే వేసటపడుచుండగాఁ జిత్రరేఖ నేను జగములోఁ బలుగల పురుషుల పటములు వ్రాసి తెత్తును. ఆ శిల్పమునకు నేనునాఁడులు పట్టును.' అని చెప్పి యామెకు విప్రలంభ మెక్కుడై పోవ నుపాయముచేయఁబోలెఁ దనపనికై వెడలిపోయినది. తరువాత విరహానలంబు ముప్పిరిగొనఁగాఁ దనలో నామె

సీ. చెలులు బొమ్మలపెండ్లి చేయుచో లజ్జంతు
మగనికై యేనేల మఱచుకొంటి
కలలోన నొకనిఁ జక్కనివానిఁ బొడఁగని
వెలిఁజూపు నేనేల వెట్టనైతిఁ
దగువయుండని తాఁక తపవి కూర్పకమున్న
బంధుల నేనేల పలుచనైతి
గతిమాలి బిగియారు కౌఁగలి లేని యా
ఱడి కూర్మి నేనేల యట్టు నడచితిఁ
గీ. నడిసి పాసిన చవి చూపఁ గలిగెఁగాని
పాసి కదిసిన చవి చూపఁ బాఁగుగాదు
తలఁపునకుఁ జక్కనుండెడి తలఁపు లేదు
(1) లజ్జ బోఁదోఁచిన లజ్జకు లజ్జ లేదు.

నిక్కువమైనమాట యున్నది. ఇంతటినుండి విరహానలము ప్రజ్వలించినది. వెచ్చనూర్చినది. మండమారు

(1) లజ్జితుమపినలజ్జతే — అనర్ఘ-చూ-

తో పాలంభము మొదలుపెట్టినది. మన్మథుని దూషించినది. పిమ్మటఁ దాపము సయిరింపలేక యుల్లము డిల్లముగాఁ దొడఁగినం గీడ్పడం దలంచినదఁట. ఆ కీను పాటిట్టిది యనఁగా డినలో నిటులు తెలఁచుట :—

చ. కిసలయపత్రికన్ మకరకేతన మాతినవాఁడె లన్నియుం
బోఁపఁగ నిల్పించి యుంగుఁ గుప్పాణులఁ పమ్మయు నాసచేయు నా
కొనరు తెలంగి యంగి కుటకుంభములం గాచెఁబాల్చినన్న నం
తసమున వ్రాసియిచ్చిన గదా నెలికత్తెల కేను వ్రేమొకా పడన్.

ఉష యిట్లెద్దో యిప్పుడు మనకుఁ గవి బాఁగుగాఁజూపి నాఁడు. వారాంగనల పాలపొంగువంటి భావము పొంది యున్నది. ఇట్లనుచుఁ బతిభోగవాంఛానిరతయైనదఁట. అటు పిమ్మటి యవస్థను వదలలేక కవి ప్రాసముపూసిన యీ పద్యమాదిగాఁ జెప్పినాఁడు.

క. నీహారము పేర పక్షి
వ్యాహారము విన్న సంగువాఁడుఁ గనుపుగా
నే హార మఱియుఁ బెట్టిన
నాహారము కొలుగుఁ దొలఁగు నాహారంబున్.

వ॥ ఆసమయమ్మునంబతిం దడవందలంచి నెడనెడ మదనోన్మాదంబు పొడమిన నప్పుడంతొక యిట్లనియె.

ఉ॥ నా దెసఁగామునమ్మలకు నాటుట్టోషము సిగ్గుఁజిత్తముఁ
వాదులపెట్టుకొన్న యవి వాడన నెవ్వరికైన ముందురా
రోదయితం గనుంగొన సరోరుహలోచనలార యింతకున్
"జారుల యిల్లు చొచ్చి నెకఁజిల్లెడి వెన్నెల పెట్టకొందునే,"

వ. అనునెడఁబిరిగొన్న యూరటంబు. పోరింబోరిఁగారింపం దొడఁగిన.

గీ. ఎసఁగుసంతాపభరమున నిట్టి నట్టు
పొరలు శయ్యాతలంబునఁ బువ్వుఁబోఁడి
తివురు విరహానలంబున దివ్వెయొత్తిఁ
జిత్తజాతుండు వత్తిఁదాల్చిన విధమున

వ. తదనంతరం బంతరంగంబు సంతాపంబుచేఁ జేతనా రహితంబగుచువచ్చిన.

ఉ. డెంపముమీఁదఁ జెందొవకు డెప్పరమేమియులేదు చన్నులన్
జింగుసుర్మవారి నెవిఁజేర్చిన లేఁజిగురించుకింతయుం
గందదు నాసికాగ్రమునఁ గన్నులబాష్పము లూటబింక నీ
సుందరికానసేఁడు ప్రసూనశరుండని యూర్పుమాన్పు
న సెలికతెలున్నంత

మదనావస్థలన్నియు నలంకారికులు చెప్పినటులు వర్ణింపకున్నఁగొంతయగుననియో, చిత్రరేఖ పటమును వ్రాయు నీయేఁడునాఁడుమూరకకూరుచుండఁజెట్టుట యేలనియోయిట్లు కవి వర్ణించినాఁడు. దశావస్థలు చాలక, విన్నకోట పెద్దయ కవి చెప్పినటులు (౧) ద్వాదశావస్థలలోఁ బదునొకండు నఱ 11½ యవస్థ లితఁడు వర్ణించినాఁడు. రసస్ఫూర్తి కవి హేతువులని యాలంకారికుల యాశయము. ఇట్టివర్ణనలవలన సంవిధానమునకు విచ్ఛిత్తియేర్పడి పాఠకులకు విసువుగొలుపును.

(౧) సీ. ఆదియుఁ జక్షుఃప్రీతియన, నంతఁజిత్తసం
గంబునా, మఱియు సంకల్పమనఁగ
నటఁబ్రలాపంబునా నవుల జాగరమన
నటమీఁదఁగార్శ్య సమాఖ్యమనఁగ

నఁగాఁ జిత్రరేఖ వచ్చినది. ఆ ర్రమూర్తులైన చెలికత్తె లు-మాతల్లియని సంబోధించిన చెలికత్తెలు — చిత్రరేఖతో నుషాస్థితి యిసుమంతయుఁ జెప్పలేదు. అపుడుచిత్రరేఖ హ డావడిగాఁ, బుష్పాడి తిప్పలు, కప్పురపుఁ గుప్పలు, మణికు ట్టిమంబులన్నియుఁ దుడిచి తుడిచి, (ఈమెకుసాయమెవరు లేరు) హంసతూలికాతల్పంబుల కీళ్ళుసరిచేసి దోమతెరలెత్తి శుకశారికలకుఁ జప్పుడు చేయకుండ నాజ్ఞాపించి యరవింద కర్ణికాపీఠంబులఁ గందర్పపూజ చేయించి, యిట్లు కన్యాంతః పురంబులం గలయంగొనుఁగొనినది. అప్పటి కా చిత్రరేఖకుఁ బని తీరికయైనది. అపుడుషాదేవిఁ జూచి, 'ఏనొకటిచేయఁ దలఁచిన విధి తానొకటి తలంచె' ననుకొనినది. పిదపఁ దొందరపడి పాన్పునఁబవళించిన యుషంగాంచి యప్పొలఁతి కన్నులకొలఁకులఁ గెలుకొన్న కాటుకనీటిబొట్టుల తనబట్టచేఁ దుడిచి కుచంబులపైని సరఁబులఁ దిన్నగాఁజేసి యొకదేశం బునందలి ముంగురుల నూలుకొలుపఁగాఁ దెప్పేఱినదఁట. ఈ సౌభాగ్య మీామెకు దక్కింపనెంచికాఁబోలు సంతవమునకు, ఉషలేవలేదు. ఆచందమెఱిఁగి చిత్రరేఖ పటముసుజూపినది. ఆపటములోని పురుషులఁ జూచుచుఁబోవఁగా ననిరుద్ధుఁడు కానఁబడునంత మైజాదుకొన్న పులకములతోడఁ జెమట పొడమఁగా 'మనసు ముచ్చిలిచొచ్చిన మత్తికాఁడు వీఁడు పొమ్మని వెలఁది చేసాఁచినదట' తరువాతఁ జిత్రరేఖం బతిమాలుకొని యనిరుద్ధుఁ దీసికొనిరాఁబంపఁగా నామె

నఁగాఁ జిత్రరేఖ వచ్చినది. ఆ రమ్యాకృతులైన చెలికత్తెలు - మాతల్లియని సంబోధించిన చెలికత్తెలు — చిత్రరేఖతో నుషాస్థితి యిసుమంతయుఁ జెప్పలేదు. అపుడుచిత్రరేఖ హడావడిగాఁ, బుష్పాడి తిప్పలు, కప్పురపుఁ గుప్పలు, మణికుట్టిమంబులన్నియుఁ దుడిచి తుడిచి, (ఈమెకుసాయమెవరు లేరు) హంసతూలికాతల్పంబుల కీళ్ళుసరిచేసి దోమతెరలెత్తి శుకశారికలకుఁ జప్పుడు చేయకుండ నాజ్ఞాపించి యరవింద కర్ణికాపీఠంబులఁ గందర్పపూజ చేయించి, యిట్లు కన్యాంతఃపురంబులం గలయంగొనఁగొనసరి. అప్పటి కా చిత్రరేఖకుఁ బని తీరికయైనది. అపుడుషాదేవిఁ జూచి, 'ఏనొకటి చేయఁ దలఁచిన విధి తానొకటి తలంచె' ననుకొనినది. పిదపఁ దొందరపడి పాన్పునఁబవడించిన యుషం గాంచి యప్పొలఁతి కన్నులకొలఁకులఁ గెలుకొన్న కాటుకనీటిబొట్టుల తనబట్టచేఁ దుడిచి కుచంబులపైని సరంబులఁ దిన్నగాఁజేసి యలికదేశంబునందలి ముంగురుల నాలుకొలుపఁగాఁ దెప్పతినదఁట. ఈ సౌభాగ్య మీమెకు దక్కించవనెంచికాఁబోలు సంతవఱకు, ఉపలేవలేదు. ఆచందమెట్టిఁగి చిత్రరేఖ పటమునుజూపినది. ఆపటములోని పురుషులఁ జూచుచుఁబోవఁగా ననిరుద్ధుఁడు కానఁబడునంత మైజాదుకొన్న పులకములతోడఁ జెమట పొడమఁగా 'మనసు మ్రుచ్చిలిచొచ్చిన మత్తికాఁడు వీఁడు పొమ్మని నెలఁది చేసాఁచినదట' తరువాతఁ జిత్రరేఖం బతిమాలుకొని యనిరుద్ధుఁ దీసికొనిరాఁబంపఁగా నామె

మునకుఁ గలిగింపక నిదురలోఁ గూరిన యనిరుద్ధునితోఁ జేర్చుటయందును నేపథ్యాంతరమున జరుగవలసిన గ్రామ్య ధర్మము బట్టాబయలుగాఁ జూపుటన్యాయ్యముగాదు. ఉష నీవిషయమై మన మూరకనిందింప బనిలేదు. ఆమె మంద మతియని యీవఱకె యెఱిఁగియుంటిమి. తరువాతివిష యము స్ఫుటముగానే గోచరించుచున్నదికదా. అపై ననిరుద్ధునిఁ బట్టుకొన్నతరావాతఁ దండ్రి కనుఁగొనవెఱచి సౌధంబులో దాఁగికొనును; పతిఁజూడఁ బైకివచ్చును. తనకు వచ్చినచేటని తల్లడిల్లును. అనిరుద్ధుఁడు రాక్షసుల నెదుర్కొనఁబోవుచుండఁగా ' వలదు వలదని ' భీతింబట్టు కొన్నది. అనిరుద్ధుఁడు పట్టువడినతరువాతఁ బెద్దపెట్టున నేడిచినది. ఈ యేడుపుమూలమున, ' తతస్తురుదతీందృష్ట్వా తాముషాంమృగలోచనామ్ ' అనియు, ' ఉషా భయపరి త్రస్తా రుదతేతత్రభామినీ ' అనియు, 'రురోదబాష్పరక్తాక్షీ తామూహాగుదతీంపునః ' అనియు ముమ్మాఱు వినఁబడు చున్నది. ఇంతటితో స్త్రీస్వభావము పరిపూర్తియైనది. ప్రభావతీప్రద్యుమ్నములఁ బ్రభావతి, ప్రద్యుమ్నుఁడు యుద్ధ మునకేఁగుచుండఁగా ఖడ్గము తనచేతితో తెచ్చియిచ్చినది. ఈ రెండుపాత్రములలోఁ దారతమ్య మరయునది. ప్రభావత్యు పాఖ్యానమునకును, ఉషోపాఖ్యానమునకును దారతమ్యము వివరింప నావశ్యకమే కాని, ' పింగళి సూరన ' చరితమున నావిషయము కవిత్వతత్త్వవిచారమునఁ బ్రతిపాదింపఁబడియెఁ

గాన నుపసంహరించుచున్నాఁడు.

చిత్రరేఖ — చెలికత్తెలు

చిత్రరేఖయొక్కటిదో యిటయెఱుకపడినది. మందమతియైన యుష కీమె సరిపోయినది. ఎట్లెట్లో యంబికయూనతిచ్చిన కలను ద్రష్టప్తకిఁదెచ్చుటచే నామెకంతుఁ దెలివికలది. మిగిలిన చెలికత్తెలందఱును జాలమందమతులు. ఉష చేతనారహిత యైయుండఁగాఁ జిత్రరేఖ యచటికి వచ్చినతోడనే నాపదలో నున్నారు కావున మాతల్లి యనిమాత్రము సంబోధించి యుష యిట్లున్నదని చెప్ప మూర్ఛమునంతి మందమతులు. చిత్రరేఖయుఁ దాను ఏడునాళ్ళనుండియు వ్రాసి తెచ్చిన పటమును జూపింపనైన ముందుగా నుషకడకు వెళ్లక, యంతఃపురములన్నియుఁ జూచిచూచి పదిమందికూలివాండ్రను చేయదగినంతపని తానొక్కతెయే చేసి పిమ్మట మెల్లగా నుషను జూడఁబోయి 'యేనొకటితలఁపఁ దైవమొకటితలఁచె' నని చెప్పి కాటుకనీరు తుడిచి తీయనిపలుకులు పలికి యామెను లేపినది. పిమ్మట ననిరుద్ధుఁ దెచ్చినతరువాత నాదంపతు లిరువురు నేకాంతముననుండఁగాఁ దొంగిచూచుచుఁ బ్రొద్దుపోవుటచే విసివి కాఁబోలు ననిరుద్ధుని మాయనుండి విముక్తునిఁజేసి లేచిపోయినది. ఈమెను గవి యెంతనీచపాత్రమును జేసినాఁడో చూడుఁడు. బాణాసురుని ముఖ్యమంత్రికూఁతురీ చిత్రరేఖ. మందమతికి మందమతి యొడఁగూడుఁ గాని యొండెటులు?

చ. ....... సుస్థిరము సైన భావముల్
తెలిసినభావమొక్కటియునీదుతలంపు హ.ఉ-౨-౧౦౯

అని సంబోధించుచున్నారు. ఇట్టిమనస్థితిలో కలను నిక్కవముగాఁ దలఁపవచ్చును. ఇట్టిది 'కలలోఁగాపు' అని నెుఱుంగకయామె యేడిచినదఁట చెలికత్తెలందఱును గలయని స్ఫుటీకరించినారు. చిత్రరేఖ యప్పుడంబికాజ్ఞను దలపెట్టినది తలపెట్టిన వెంటనే యుష యావిషయమును దెలియ గూఱుతున కుఁ దెచ్చికొని చిత్రరేఖను బ్రార్థింపఁగా నామెపటము వ్రాసితీసికొని వచ్చినది. ఉషకు 11½అవస్థలురాలేదు. చిత్రరేఖ అంతఃపురగృహంబులన్నియు నూడ్వలేదు. ఆపటముఁ జూచి యుష

క. ననుమాఱుపెఱోంపుఁబోయిత
గనుఁగొంటినిఁ బట్టు నడిలి గతవమిటు సే
సినఁబోనిత్తు నోయనుచును
దనమదఁగొలుకుగతి గొంతతపీక్షించెఁ హ.ఉ-౨౧౪౪

పిదపఁ జిత్రరేఖతో, వినయముగా

క. తులమొల్లరు నింపయొకటి
పలఁపరు కామార్తలైన తెఱుఁగులు మాన
స్థలనమెఱుంగరు నన్నా
కలఁకిడు రానీకు నీవుగల ఫలమతివా! హ. ఉ-౨-౧౬౨

అని చెప్పిదౌత్యము చేయుమని ప్రార్థించిపంపినది.

చిత్రరేఖ

చిత్రరేఖ పెగ్గడకూఁతు. ఉషకుఁబ్రాణమిత్రము. కాని యీామెయేదౌత్యము చేయవలసివచ్చినది. ఆవిషయమై

యుషయిట్లనుచున్నది.

దౌత్యంబులాఁతివారి దెసనాక్రాంత యొగ్గియు తోఁచుంగాని
తన ప్రాణంబులతో సమానంబగు జనంబునందుఁ గేవలగౌరవంబున
కయ్యెండు నిన్నుయోసెయిజుంగని భంగుతే

హ. ఉ ౭-౧౬౩

ఈమె చిత్తరువులు బాఁగుగా వ్రాయునేరుపుకత్తె. ఈ తెఱఁగిటులు వ్రాయఁబడినది.

సీ. అధిక విస్తీర్ణమై యమరునాలేఖ్యప
టంబునవలయు వర్ణంబులెల్ల
నొడఁగూర్చి తూలిక యొప్పఁ గైకొని
... ... ...
నొనర వ్రాసి ... ... ... హ. ఉ. ౭-౧౨౯
మఱియుఁ జిత్రరేఖ చూపు నిపట్టఁగ నెదు చూడుఁడు
ఉషయనిరుద్ధుని జేసి
క॥ నను ... ... ...
పోనిత్తు మెయనునట్లు గాఁ జూచుచుండఁగా
"వ॥ చిత్రరేఖయుఁ బడఁతియభావం బుపలక్షించి
మ. అనిరుద్ధాకృతి మీఁదఁ జిక్కెనడ యయ్యబ్జాక్షిచూపంగముల్
ఘనరోమాంచము నందెనచ్చఁ బ్రియునిక్కంబు"

ఏఱ్ఱాప్రెగడ చెలికత్తెలందఱకును సమానగౌరవ మిచ్చియున్నాఁడు.

సోముని యనిరుద్ధుఁడు.

అనిరుద్ధుఁడు విభవప్రసిద్ధుఁడు. బంగారుమేడలో నిదురించుచున్నాఁడు. కల్లుతాగ్రివుటచేఁ గైపెక్కియున్నాఁడు. లతాలంకారములకు మెచ్చి మొగమిచ్చు లేమావిమోకవలె

నున్నాఁడు. తారకాపటలంబుతో నవ్వఁదొరకొన్న పిన్నచం
దురుసిబలెనున్నాఁడు. విచ్చుతమ్మి మొగడపైఁ జూతాడు
తేటిఁరాచవాలువలెనున్నాఁడు. సౌదామినీసల్లాపముల మేను
గరుసాటీన మిండమేఘమువలె నున్నాఁడు. చెలువలకు యౌ
వనమువిందు చేయనున్నాఁడు. (౧) ఇట్టివానిఁ జిత్రరేఖదీసిఁ
కొనిపోయినతరువాతనుషాలింగనంబునను మోవిని మోవి
చేరుపుచేతను జేతలాఁపిచేతను దానొకమగువ కౌఁగిటనున్న
టులు తెలిసికొనినాఁడఁట. అపుడు

క॥ కలగన్నచందమో మద
కలఁగుటయో ప్రైంద్రజాలికవినోదంబో
తెలియఁగ నేరనటంచును
దలఁచును నిజమైన నేనుధన్యుఁడననుచున్॥ ౫–౨౧౩

ఇటులుతలఁచినాఁడఁట. ఉష యెవతయో తానెఱుఁగఁడు
ఇదికలయేమో’ అని యనుకొని నిజమైనయెడల నేనుధన్యుఁ

---

(౧) ఆఱవయాశ్వాసమున నారదునితో శ్రీకృష్ణుఁడు ముచ్చ
టించుచు ననిరుద్ధునివిషయమయి,

క॥ ... ... ...
మనయనిరుద్ధుండు నిన్న మగువలుగొలువన్
దనయింట రాత్రి నెమ్మది
నునికి గలిగ” ౬–౮

ఇట్లుచెప్పుటచే నారదుఁడు శ్రీప్రవేష్టతుఁడనియు నది తండ్రి
కిఁగూడఁ దెల్లమనియును సంతియకాక యాతనికి నిష్టమనియుఁగూడ
సూచితమగుచున్నది. రాజులు రాజకుమారులు నిట్టివారయినచో
లోకమెటులు యోగ్యస్థితినుండఁగలదు? కవి యీవిషయము ననాద్య
శముగా వర్ణింపవలయును.

డనని తలఁచుచున్నాఁడు. అబ్బా! ఎంతటిబ్రహ్మచర్యము నీతఁడునడుపుచున్నాఁడో! పిదపబాగుగా నిదురనుండి తెప్పిరి యఁకాక్షుని పొందు నిక్కముగాఁ దెలిసికొన్నాఁడఁట. అపుడును నాతనికించుక విశయము తోఁపకుండుటచే ధన్యుఁడు. ఉపయునపుడు సంకోచమొందకుండుటగూడఁ జిత్రముగానున్నది. మంచురాలుగావున నామెకై మన మాశ్చర్యముఁగూరనక్కఱ లేదు. పురుషుఁ డితరకాంతాశయ్యాయందుండిన స్వభావముగావానికి నెట్టియూహలుజనించునో అట్లే స్త్రీకిని నెట్టిభావములుదయించునో కవిఁ గోచరింపలేదు. అంతరంగముపైఁదట్టిన వట్టిపదములకూరుపేగాని యీభాగముభావశూన్యముగానున్నది. నిద్రితుని జూచిన నొకవెలఁదుక తలఁపుల మంచనమహాకవి యెంతసొబగుగా వర్ణించినాఁడో యది యిచటఁ దెలుపుట యప్రకృతముగాదు.

చ॥ ... ... ... ... ...
... ... ... నిద్రితుఁడైనభూపతిం
గనుఁగవ అప్పవెట్టని వికాసము నెక్కుడువేడ్కతోడ నె
మ్మనమునఁ జోద్యముంబొదల మన్మథుఁడుద్ధతిఁ జాపమెక్కుడన్

ఉ॥ ఆరమణీలలాము హృదయంబున నాదట లంతకంతకుం
బేరఁగనింపు సంతసముఁ బెంపువహింపఁగ అప్పవెట్టఁగా
నేరుపులేక వేడుకలు నిట్టలదోసెడు వాలుఁగన్నులన్
వారణలేక క్రోలె జనవల్లభసుందరు మేనిచెల్వమున్

వ. అట్లుచూచుచు నాత్మగతంబున.

సీ॥ ఈ అప్పపాదివిచ్చి యించుకచూచిన
నొప్పారుకన్ను లెట్లుండునొక్కొ

నఁదానున్నపుడు సామాన్యముగా నేరీతిగా మాటునోయా మాట్లు కూర్చినాఁడు.

గీ. ఆసరసిజనేత్ర యధికసంభ్రమమునఁ
జిత్రరేఖ తనవిచిత్రవాక్య
ఫణితి వినుతిఁ జేసి ప్రాణవల్లభునని
రుద్ధుఁ జూపెఁ జంద్రరుచిరముఖుని

వ. అయ్యవసరంబున ననిరుద్ధుండు మేలుకాంచి విరహార్తై తోఁచు కాంతామణి కూర్తిశగ్రాన్యంబులంబుఁ జూచి కలయో యథార్థంబో యనిచింతించి ముందటనున్న చిత్రశకుంగనుంగొని

క. తరుణీ ! నీ వెవ్వతెవి
ప్వాగయిరదన నన్నుఁ దెచ్చి ప్రాసికయెమి
త్రాణి నన నాతనికి సవి
స్తరతఁ దెలిసిరాలుమని యడసనఁ జూపెన్.

చ. కుటిలుమొగింబునం జెఱఁద్రగ్ముడి యించుక వీడఁ జెక్కుల న్
జిఱునగవుల్ దొలంక మృదుచేలము జాఱఁగఁ గన్నుదోయిఁ గ్రొ
మ్మెఱుఁగులు చిందఁ నెన్నొయి మేనుగిరంబున నూఁదనిక్కఁ బా
త్రజమును వేష్కయుం బనఁగఁ బెంపెను గామినిఁ జూచెనల్లతన్.

క. తరుణీ తనుహులు హారం
డోరుల మొఱఁగి చూచుచూపులోనన్ జేమనుఁడి
ద్దళహైనిగిడించు మనో
హారకువలయమల్లికామహాశుగములనన్.

చిత్రభా-౫-౧౪౦

నాచనసోమునకు వడిమెక్కువ. శాంతితక్కువ. చిత్రరేఖచే ననిరుద్ధునిఁ దెప్పించినపిదప నుషానిరుద్ధులకు స్వభావము లెటులుండునో యెటులమాటునో కొంచెమైనను దానాలోచింపకపానుపుపైఁ బడఁద్రోచినాఁడు. అదియటుండె. భాగ

వతమునను, గవిజన మనోరంజనమునందునను నీభాగము బాఁగుగా వ్రాయఁబడియుండలేదు. అదియుంటుండె.

తరువాత అనిరుద్ధుఁడు

సీ. తెనులించి గురుశౌర్యుఁ బిదియు లేకటమున్న
కసినకామ్మోలెఁ గఱచికాచి
నెవ్వెవెసపోఁడపై నదెఁ లేకటమున్న
యలవ్రైకౌఁగిట సదమియుచు
నలు వెషలింపఁ జీవాలు లేకటమున్న
[illegible]కొన్న[illegible]పం[illegible] [illegible]
తమకించి కోపకు పంపాగులేకటమున్న
కౌఁగనచి [illegible]ంబు గఁటఁచికరఁచి

గీ. తుదిని మొసలుకుండెఁ మదికండె నుసంజాఁ
నవులుకన్న[illegible]న పలుపుఁ జనుపులిచ్చి
ప్రాణింపుచేసి సంక్రాంతపు కొమ్మఁ జేసె
మానినీతిలకంబు సమాదనటుఁడు

ఇటులు ఉషను జంత్రపు బొమ్మఁజేసెనఁట.

సింహావలోకనముచేసి యీవిషయమంతయుఁ జూచిన ననిరుద్ధుఁడు జారాగ్రేసరుఁడని తోఁచకమానదు. అనిరుద్ధుఁడు యుద్ధమొనర్చి బాణాసురుఁజిక్కువఱచుటచేనాతఁడు మహావీరుఁడని మాత్రము కనిస్ఫురింపఁ జేసినాఁడు. తుదకాతఁడు పట్టుపడినను లోటు లేదు. ఈయుపాఖ్యానము, బాణసంహారమునకు బీజముకావుఁ ననిరుద్ధనిబర్హణము అనౌచిత్యముకాదు. అనిరుద్ధుఁడు 'పితామహస్తుతి వచోవ్యాపారపారీణుఁడ' ని (౬—౨౪౧—) చెప్పఁబడుటచేఁ బితాది భక్తికల

ట్టి కలను దాఁగూడఁగనినాఁడు. ఆమెకై తాఁ బరితపించు చున్నాఁడు. లౌకిక దంపతులరీతి వీరువురు నున్నారుగాని విటులవలెలేరు. వీరి యనురాగాతిశయము పరమకాష్ఠగాఁ గవి వర్ణించినాఁడు. ఇంకను జూపవలసిన విశేషములనేక ములు ఇందున్నవిగాని గ్రంధవిస్తర భీతిచేనవన్నియు నిందుఁ జేరుపఁజాలకయ్యెద.

సంవిధానము.

మూలములోనున్న రీతిని నాచనసోముఁడు పూర్తిగా నిచటఁ దాఁజూపించినాఁడు. విశ్వనాథకవిరాజు

(౧) వస్తువనుచితముయినను నాయకునకుఁగాని రసమునకుఁగాని విరుద్ధమైన యెడల దాని విడువలయు; ఒండొకవిధంగా తెలిసికొని గా మార్చుకొనవలయు

అని చెప్పియున్నాఁడు. ఇచట మార్పవలసిన విరోధ మేమియు లేదు. పైఁగా మార్చిచి యనిరుద్ధుని మృష్టపాత్ర మునకుఁ బ్రభమోదాహరణముగాఁ జేసినాఁడు. ఇంతియు కాక యుషకుఁ జిత్రరేఖకుఁగూడఁ బ్రతిపదమునందు ననౌచి త్యమావహించు చున్నది. ఏతాపైగడ యౌచిత్యమును బాటించి మూలమును వదలక రసయుక్తముగా వ్రాసి యున్నాఁడు.

---

(౧) యత్ స్యాదనుచితం వస్తు నాయకస్య రసస్య వా,
విరుద్ధంతత్పరిత్యాజ్యమన్యథా వా ప్రకల్పయేత్. సాహిత్య.

యంతయుఁ గొన్నిగంటలలో జరిగినటులు తోఁచుచున్నది కదా !

అనిరుద్ధునిఁ గొన్నిగంటలకాలమే యచటనుంచిన శోభ లేదు. పూర్వాపరగ్రంథవిరోధముకూడఁ బొసగెడిని. కావునఁ గాలవిషయమునన నీగ్రంథమంతయుఁ బూర్వోత్తరగ్రంథ సందర్భవిరుద్ధమగుటచేఁ గొఱవడియున్నది. ఈవివక్ష మన కవులకుఁజాలఁ గొలఁది.

## IV

### హాస్యరసము.

చాటువులు—లంకోపరప్రహసనము—సోమన—ఎఱ్ఱాప్రెగడ—శ్రీనాథుఁడు—ముంచెనమహాకవి—నన్నయభట్టారకుఁడు—ఔచిత్యవిచారచర్చ—మాఘనభట్టుఁడు.

### చాటువులు

హాస్యరసము ఆంధ్రవాఙ్మయమునఁ జాలఁగొలఁదిగాఁ గాననగుచున్నది. ఆదికవుల కవితలయందందందు మనోహరమైనహాస్యరసముకలదు. చాలఁజోటులఁ జదివినవెంటనే తెలియరాక కనుపుబ్బఁ జేయునంతయెక్కువకాక యందయి మిడియున్నది. సంస్కృతకవులీరసమునంతయు మొదటినుండి తుదిదాఁకఁ బచ్చిబూతులబుంగగారచించిరి. లటకమేలకము మొదలగు కొన్నిప్రహసనములలో నగ్నులగుమగవాండ్రును ఉచ్చమల్లియలగు నాండ్రును పాత్రలు. ఇట్టిహాస్యరస మసభ్యము.

తొలుదొలుతఁ బ్రతివిషయమును మిగులసామాన్యము

గానుండి కాలాదిపరిసరములచే మాఱుట ప్రకృతి. అటులనే క్రమముగా ఈరసము నున్నతదశకు రావలసియున్నది. తెలుఁగు చాటువులలోఁ జాల హాస్యరసమొలుకు పద్యము లచటనచట విననగుచున్నవి.

క. ప్రాతర్ఘటికల మేల్కని । ప్రాఁతిగఁ బలుదోమి శుభ్రపరిధానుఁడవై
మాతామహుఁడవు పెద్దవు। తాతా! నావీఁపు గోఁకు తావా? లేదా?

అనునీమొదలగు పద్యములు చరిత్రకారులు సేకరింపవలసియున్నారు.

### లంబోదరప్రహసనము

ఆంధ్రద్రావిడదేశములలోఁ బ్రచారమునందున్న లంబోదరప్రహసనము చాల నసందర్భముగానున్నది. గ్రహచారవశమున దానికిఁ గాళిదాసకర్తృత్వమొడఁగూర్చి కాళిదాసప్రహసనమనియు వ్రాయుచున్నారు. ఇంతియకాక దానిగుఱించి యొకకథ యల్లినారు. భోజమహారాజు కపాలమందు జలభాగమెక్కుడయి యచటనొక చిఱుకప్ప పొడమ దాన నాతఁడు మిగులబాధితుఁడయి వైద్యుల రావించి తెలుపఁగా వారు బిట్టునవ్వినయెడల నాకప్పయుబికి బయటఁబడునని చెప్పఁగా నొవ్వుచే నాతఁడు నగవుచెందకుండుటచేఁ గాళిదాసుఁడీ ప్రహసనము విరచించి యాతనికి వినిపింపఁగా నాఁగుకొనలేక యాతఁడు పకపకనవ్వెననియు నాకప్పకపాలమునుండి బయలువాఱెననియుఁ గథాకోవిదగ్రామవృద్ధులిటులు కథలు చెప్పుచున్నారు. తత్త్వము విచారింపఁగా నీపుస్తకము విరచిం

చినాతఁపు కాళిదాసా పరనామధేయుఁడగు వేంకటేశ్వరుఁడు.

హాసము మూఁడువిధముల నీసేనసూత్రులచేఁగలుగును. పాత్రములను వగ్నములఁబోషించి చాతుమాటల నాడించి నగవు తెప్పించుట ప్రహసనావస్థ. ఇన్నూఱుసంవత్సరముల వెనుకనే ప్రహసనములు వ్రాయుకవులు ప్రచురముగా బయలుదేఱిరి. ఏఁబదియాఱువదేండ్లకు మున్ను సంస్కృతకవులు వంగదేశమున నుత్పన్నులయినవారును దాంగ్లరీతిగానే ప్రహసనములనసభ్యములుగా వ్రాసిరి. డిండిమ ప్రహసనమునసభ్యము గనేయున్నది. తెలుఁగు భాషయందును సంస్కృతము ననుసరించిన వీధినాటకములు ఒకటి రెండు కానఁబడుచున్నవి. వానియందు హాస్యరసమే లేదు ఆంగ్లేయభాష ననుసరించి తమ ప్రౌఢశక్తిచేఁ గందుకూరి వీరేశలింగకవిగారు కూర్చిన ప్రహసనములే నేటికి హాస్యరసమును బోషించిన యుత్తమ గ్రంథములు. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారునునింకను జక్కని హాస్యరసమును బోషింపఁగల వారయి వన్నెకెక్కుదురు.

సోమన.

హాస్యరస మీకవి తిన్నగాఁజిత్రింపలేదని, రా. అ. శర్మగారు వ్రాసియున్నారు. వేదుమళ్ళ అచ్యుతరావుగారు హాస్యకరుణారస మిశ్రిత మైయున్న భావమును గమఁజిత్రముగానిరూపించియున్నాఁడనిహంసడిభకోపాఖ్యానమునందలి

క. వ్రేలెడు వెంట్రుక లిరుగఁడెఁ
[illegible]ాలఁగఁ బలయూఁచు దొప్పు చొప్పన నోటం
గేలనడిచి కొను నెలవుల
లాలలు దొరుగంగ నన్నలాయని యొఱలున్

క. రాలం బలయుడిచి కొనున్
నేలంబడి పొరలులేచు నెత్తురు లుమియుం
గేలిఁబడి రిపులు సూడఁగ
నాలుక వెళ్లికి కొనుఁ జావునను గన్నికొనుఁ గా.

అని యీపద్యము నుదాహరించిరి.

మరణసమయమునందు నెవరినింత కొంచెపఱచుట న్యాయ్యమునకుదవ్వు. 'గేలిఁబడిరిపులుసూడఁగ' అని కవియే వాచ్యముచేయుచున్నాఁడు. త్రొఁచుఁబామును బ్రాణావశిష్టముగాఁగొట్టి యది యంత్యావస్థయందుఁ బడగనెత్తి కొట్టుకొనుచు, నేలను గఱచుచుఁ బ్రాణములపోకకు వేదనపడుచుండఁగాఁజూచు బాలురవంటివారుకదా యీరిపులు. తొడలుగెడయ నేలంగూలినరాజరాజును భీమసేనుఁడుతన్న లేదా? అది కొంచెపఱచుటకాదా? యని యందురేమో? అగును. నేఁటికాలమునందును అనేకహేతువులచే రాజ్యమును బరిత్యజించిన చక్రవర్తులను మానవమాత్రుఁడు కొంచెపఱచుచున్నాఁడు. భీమునకుఁ బ్రతిజ్ఞ తోడుపడుచున్నది. ప్రతిజ్ఞను నిర్వహించు కారణమున నాతఁడా తెఱఁగొనర్చినాఁడు. నవ్వుటయనునది లేఁతపని. రాక్షస చక్రవర్తులు మునులను దేవతలను బాధించునపుడు చాలఁబురాణములందీమాదిరిగనే యున్నది.

## ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమునందు.

సీ. తపములఁ గ్రుస్సినతాపసులఁ బట్టి తే
ప్పించి యచ్చరలతోఁ బెండ్లి సేయు
మోదంబుతో నశ్వముఖుల లాయంబులఁ
గట్టి బోకిరినియలఁగవణమెత్తు
భుజగేశ్వరుల శిరంబుననున్న మణులూడ్చి
కొమరార వట్రువగుండులెత్తుఁ
తెలఁగి గంధర్వులచేతి వీణెలు పెఱా
చులకచ్చి పాడించిచూచి నవ్వు
గీ. ఖడ్గములు పాదుకలు ఘుటికలును నపహ
రించి సిద్ధపుంగవుల గారించుచుండు
భువనబాధలు తనకెల్ల బ్రాఁదివోకె
లుగసురారాతి పేర్చెనుల్లోకుఁడగుచు.

౨. ఆ. ౧౨౩

ఇట్లతని చేష్టచెప్పి హాస్యరసమును వెలువరించినాఁడు.

శ్రీనాథుఁడు.

## శ్రీనాథుని హరవిలాసమునందు

సీ. తలమీఁదిచదలేటి దరిమీలఁదినఁ జేయు
కొంగలు చెలఁగి కొంగొంగురనఁగ
మెడఁదన్నుపునుకల నిడుపేరులొండొంటిఁ
బోరిఁబోరిఁదాఁకి బొ[illegible] బొణుగురుననఁగ
గట్టినపులితోలు కడకొంగుసోఁకియాఁ
బోతుతోడి చిఱ్ఱుబుఱ్ఱుమనఁగ
గడియంపుఁబాములు కకపాలలోనున్న
భూతిమైఁజిలికిన బుస్సురనఁగ

గీ. పమ్మిపూఁజాలి పునుకకంచమ్ము సాఁచి
దిట్టతనమున బిచ్చము "దేహి" యనుచు
వాడవాడల భిక్షించుకూడ్డుగాని
యిట్టిదివ్యాన్నములఁ మెచ్చునే శివుండు.

మ. ఆ. ౧౬.

ఇట్లు విసువుచే హిమవంతుఁ డనినటుల రచించినాఁడు. కోపముచే విసువునొందియున్న విశేషగుణముల నింకొకనూదికిగా నారోపించుటచే దీనిహాస్యముచేకూరినది.

ఇటులనే

సీ. పులింద ?ాసంబు గన్పడును ?ంగగిరీశ
విద్యాధరాంగనా విటగణంబు
గంధర్వకామినీ కాముక వ్రాతంబు
సాఁతాలఁగొని మోఁద ?జ్జఁగొంద్రు
కకపాల వెలిబూది కన్నులలోఁ బ్రామి
బాధింతురప్పరిపల్లవులు
గరుడభామా భుజంగ ప్రతానముఁ బట్టి
బాధింతురురుయోగపట్టములల
గీ. నాగడీలు మహౌషధ్యులగదుఁగాని
లుప్తితులు గొంల్లు పలుగాకుడుకుమిడుకు
లాకతాయిలు శకులు గయ్యాళులగుచు
నోషధిప్రస్థమెల్ల నిల్లిల్లునుడుక.

ఆ. మ. ౧౦.

ఇందు నగవు, దానిని మిాత్రీనయుల్లరి వెల్లి గొనినటులు అల్లినాఁడు. ఇదియు వారిచేష్టల వర్ణించుటచేఁ బొడముచున్నది.

కేయూరబాహు చరిత్రమునందు మహామహుఁడగు మంచన మహాకవి కథలయందుఁ జక్కని రీతిగా హాస్యరసము ననుసంధించినాఁడు.

సీ. ఆ తేనెబొట్టున కంచట నీఁగలు ముసి
  రిన వానిఁ బట్టంగ నని కటంకఁ
జేరఁగ నచ్చటి కొక్కు చెలఁగి యా బల్లిఁ గ్రమిం
  గిన బల్లి నొక పిల్లి దినియె నంత
నా పిల్లిఁ గఱచె రాజాశ్రితుండగు వేఁట
  కుక్క, యొక్కటి, దానిఁ గోపమునను
బొడిచె విడాలంబు, నొడయుని నగరి కు
  క్కలవారు చంపి కడఁగి దాని
ఆ. దాని వాడవారు తవిలి చంపించిరి
కుక్క నంతఁ గినిసి కుక్క వేఁట
కాండ్రు కొంప నూఁగి కత సవిస్తరంబు
నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి.                కేయూర-

దీనియందుఁ దేనెబొట్టున కెన్నియో మూఁగి కడఁదేలుట హాసము నొదవించుచున్నది.

నన్నయభట్టారకుఁడు.

నన్నయభట్టారకుఁ డరణ్యపర్వంబున

క. నలుఁగానమివ్వనంబునఁ
గలవెవ్వడు కాంతుముగ్ర కరులను సింహం
బుల బుక్షంబుల నిదివ
స్త్ర్యల కవిసయ మాతపంబు దూఱఁదుడీనదే.

౨-౧౦౭.

జన్నిదంబులు కాని సంకెలలై పట్టఁ
    రొగఁపన్ని మిన్నక తిరుగువారు
ముంపటిదికూ్రడి మొలత్రాడుఁ బవిలిన
    తోఁకగోఁచులవెంటఁ దూలువారు
దగయొత్తపోలేక దండంబులూనైచి
    హా! విధీ! యనిచేతు లార్చువారు
గీ. గడవసంబులమోఁదినఁ గలఁగువారు
వల్కలంబులు దోఁచిన వంగువారుఁ
జెలులువోయినవారలఁ జేరువారు
నైమునీంద్రులు దిరిగి రయ్యాశ్రమమున.

౧-౧౦౭

ఇటులు సరికునిచే బాధింపఁబడిన మునుల వృత్తమును వర్ణించినాఁడు.

మునులు వెడలి కృష్ణునకు విన్నపంబు చేసి తమ తెచ్చిన విధ్వస్తోపకరణంబులు విప్పి చూపి

మ. అది నాయుష్ట్రమసీయవస్త్రి మది నా యాషాఢరాంభస్వయం
బది నా స్రుక్స్రువపాత్రవర్గ మది నా యజ్ఞోపవీతవ్రజం
బది నా దారవయంత్రలెష్పిది మది నా హైణోల్లేకీయాజినం
బది నారాంకవకంబళంబని పదార్థాలోకనవ్యగ్రులై.

చెప్పినారఁట. ఈపద్యమునందుఁ జక్కని హాస్యరసమున్నది. ఇటులనే హంసడిభకోపాఖ్యానమున దూర్వాసుఁడు శ్రీకృష్ణభగవానునితో మాటలాడు నెడను జక్కని హాస్యరసము కాననగుచున్నది. హంసుఁడు దూర్వాసునిఁ బనికినకాలోరగంబుఁబట్టిన తెఱఁగునఁ బట్టికొని

## మూడవ విమర్శము.

i

సోమనాథుఁడు మహావిద్వాంసుఁడు — హంసడిభకోపాఖ్యానము — సాంటాకర్ణోపాఖ్యానము — జనార్దనుఁడు

ఈమహాకవిబుక్కరాయనిశాసనమున

... ... ... ...

... ... ... సకలాగమవేదినే
అష్టాదశపురాణానా మభిజ్ఞాతార్థవేదినే
అష్టభాషాకవిత్వశ్రీ శ్రీవాణీజితసంపదే
సోమాయ వాచనాంభోధిసోమాయామితతేజసే

అని యిట్లుదాహరింపఁబడినట్టుల సకలాగమవేదిగాఁ గానబడుచున్నాఁడు. తత్త్వశాస్త్రమునం దీతనికిఁ బాండితి యనుపమముగానున్నట్లు శ్రీగ్రంథమునఁ జాలఁజోటులఁ దెలియఁగును. తత్త్వశాస్త్రము పుష్కలముగాఁ జదువుకొనుటయేకాక ఆత్మానుభవము పూర్తిగాఁ గలవాఁడు. జీవికకై సన్న్యసించి తాటదమ్మనివేసమునై చిక్కొని తిరుగాడుట యెంతకు సమ్మతికానట్టులు, హంసడిభకోపాఖ్యానమున సొగసుగా, హంసడిభకులచేఁ జెప్పించినాఁడు. అచట హాస్యముకూడఁ దొంటినట్టిగాక బాఁగుగాఁ బోషింపబడినది. వారు దూర్వాసు నిట్లవమానించుచున్నారు :-

చ. గిరిసినకూడు తెచ్చి నలుదిక్కులబోడలు తిండిపెట్టఁగాఁ
బెరిఁగినపొట్టలోన నొకకొంచెపుయుం దొరవోతె నెవ్వరిఁ

జేయుఁ గాని యందు జ్ఞానమునైక్యముజేసి యద్వైతానంద
సుఖమొనఁగూర్పఁజాలఁడు. ఈతఁడో యటులుగాదు. భగ
వంతుని రూపముచూపించుటయేగాక, ఆతనివెలుఁగు హృ
దయగేహంబునో దీపమెత్తునట్టులు నిలిపించి 'సోహం'
(ఆతఁడేనేను) అను సద్వైతపరమానందము ననుభవింపఁ
జేయుచున్నాఁడు. అమృతధారాధికము చూటలాడునట్లు,
భాగ్యదేవతకూపుచేపట్టినట్లు, ఆ మహానుభావుని సందర్శన
మును నిరూపించుచున్నాఁడు.

కంసారి పురాంగింగోరి తపంబుచేయుచుండఁగా నిరుపుర
పిశాచములు రాక్షసులు, కుక్కలు, పిశాచసైనికులు వెం
టఁదోకొని, వేటకు వచ్చిరి. వారిమోములు వికృతములు.
దంతంబులు విరిగినములు. దాడలునిమువ్వులు. మెడలునిక్కి
యున్నవి. గోములు ముశివడినవి. ముక్కులు ముమ్మాళ
లు. వెండ్రుకలు పాటలవర్ణములు. తలలుచింపిరిగానున్నవి.
తొమ్ములు బొక్కలు. పొట్టలులోతులు. గ్రుడ్లులుమిడిమి
డివి. నీఁపులుగూనులు. వ్రేళ్ళుకొంకిగానున్నవి. కాళ్లు
లావులు. చేతులీచఁబోయినవి. మూఁపులుకోలగానున్నవి.
తొడలుగుదిగొన్నవి. ఇట్టియాకృతికెందోడు పెట్టినవ్వు; కహాక
హారావములు. కాలిన తాటిచెట్టులవంటి రంగుపాడవుతో నా
ప్పారుపీరిలో నొకఁడు.

చ పిరిగోనిదాల్చునెత్తముగ్రేవులుచుట్టికపాలపాత్రిలో
విరియఁగలంపఁగ్రొన్నొప పెండ్రుకలేఁతోల్పగనైచును

త్తురుచవిచూచుఁ గంపెలు "తు సా" యని క్రాయుఁ బ్రణాలధారలం
జొరవిన ప్రేతమాలికలఁ జిమ్ముఁ బిశాచవిభుండు వేడుకన్.

(౮-౨)

మఱియొకఁడు.

చ. కఱచిన సేనుఁగున్ వెడఁద కప్పెరయున్ మొలఁ బచ్చితోళ్ళునన్
బుఱ్ఱయుల పేరులున్ మెడను బ్రాఁతకుసుమ్మనిమాఁగునీఁగలున్
బెఱికనవాలమ్ముపయిఁ జేరిన నెత్తురు ద్రేవుడుంగడుం
బిఱుముల చూపులుం గలుచు భీకరరంబులుఁ గల్గుటింపవై

(౨-౧౨౬)

ఇటులు వచ్చువారల భగవంతుండు కాంచి నెమ్మనమున విస్మయము నందినాఁడు.

పిమ్మట వారు సరులగళంబు దెగనడిచి వచ్చినరుధిరంబు చవిగొని రుచియగుటయు,

యోభుం స్తేనఏవసః — భ. గీ

అనుభావము నెఱుఁగువార పోలె, వారికి సమర్పింతంబ య్యెననుచు నద్దేవుని సహస్రనామంబులు పేరుకొని పిదపఁ గృష్ణునిఁగాంచి వారిలో నొకఁడు

ఉ. ఎక్కడివాఁడవన్నఁగడు నింపుగఁగాఱవెంజరించెడి
చక్కని మేనుసిగసొవచందము నెందునుగానమక్కటా
నిక్కము మానుఁజిత్తములు నీరగుచున్నవి కూరసత్వముల్
తెక్కలి గొన్నఁబోక్కపడదే మదిలోనినుఁగన్నతల్లియున్,

శా॥ చేతోజాతుఁడు నీవు నేమవురురో శీతాంశుచూడామణిం
బ్రీతింగోరి తపంబుచేసెదో విచారింపంగ నల్లాగున్
బాతాళంబును నేలయాంద్రిదివముంబాలించు సిద్ధుండవో
నాతండీవ్రిసను నేలవచ్చిన జగన్నాథుండవో చెప్పుమా.

(౨-౧౩౩)

అని తమ హరిహరాద్వైతమును దేటపఱచినారు. అనంతకృష్ణశర్మగారు, 'ముక్తి-ఘంటాకర్ణోపాఖ్యానమనుట ప్రాసమునకై వచ్చినది. లేక హరిహరాద్వైతము బోధింపఁదలఁచుకొని కవి వ్రాసికొనుట. కాని ఘంటాకర్ణుని పరమవైష్ణవుఁడు.' అనివ్రాసినారు; కాని మూలమున, శివకేశవారాధకులని వ్రాయఁబడియున్నది.

"ఘంటాకర్ణోస్మి నామ్నాహం ఘోరో ఘోరపరిగ్రహః
మాంసాశో విష్ణువిద్వేషీ గోత్రజః పాపకృత్పిశితాశనః

—౨౩

నన పశ్యామ్యహం తావద్ బ్రహ్మణ్యం పశ్యన

... ... ... ...

సతతం దూరయామి విష్ణుం నామకీర్తనాత్ కర్ణయోః

... ... ... ...

ఆరాధ్య తం మహాదేవం స్తువంతం సతతం శివం

అనుస్క్లోకములవలనఁ దొలుత విష్ణువును ద్వేషించువారలనియు, శివారాధకులనియుఁ బిదప బోధితులయి విష్ణువు నారాధించు వారలనియుఁ దెలియుచున్నది. కావునఁ గవి తన హరిహరాద్వైతము వారలయం దిచ్చిపెట్టలేదని మనమెఱుఁగఁదగియున్నాము. వీరుతొలుదొలుతఁ బరమశైవులు పదపడి విష్ణువుఁగూడ నారాధించి హరిహరాద్వైతము నలవరించుకొనినారు. ఇచటి మూలశ్లోకముల ౨౩ శ్లో— నుండి—౩౨వఱకును గల గ్రంథమునుజూడఁదగును.

ఇటులువారు తలఁపునఁజూచినరూపును వెలిఁజూచినరూపును, నొకటిగాఁగానఁబడినదఁట. ఆహా! రూపకల్పన యి

చటఁ బరమకాష్ఠనుగాంచినది. ఇట్టిభాగ్య మెవనికిఁగలుగు ను? ఇట్టి సవికల్పసమాధిలో శ్రీకృష్ణభగవానుని నిటులు వర్ణించినారు

సీ. తామ్రంపు గోడుసులఁ దొలివేలుపులఁ జేయఁ
బోషణించునే దేవుఁ బొడ్డుదమ్మి
గాఁడుతోఁ బ్రసవఁ గాంతి మున్నటిగరితెగాఁ
బరగునే దేవుని పాంపతటిని
పంద్రెండు గూపుత్రై పగలింటి రాజుగా
నలఁతి యే దేవుని వలనికన్ను
వేయిమానికెపుదివ్వెల తోఁ బడగలు
మ్రోల్చునే దేవుని మలఁకపాన్పు

ఆ. మునుల కల్లనే దేవుని మూర్తి నెలుఁగు
హృదయగేహంబులో దీపమెత్తినటులు
హరి మురారి నద్దేవు మహానుభావు
మనసులోఁగంటి భవములు మానునంటి

(౨-౧౮౮)

భావగాంభీర్యమును భక్తిజ్ఞానమిళితంబును నగునేతాదృశ స్తుతి నెవరు చూపింపఁగలరు? అట్టి యానందతాదాత్మ్యమం దవలయు; వెలువడవలయుఁగాని యూరకరాదు.

పిదపనాతఁడు కనులుదెఱచిచూచి యిట్లనినాఁడు:

(౧) సీ. పుండరీకములతోఁ బురణించుకన్నులఁ
గారుణ్యమను తేనె గడలుకొనఁగ
మందారశాఖతో మలయఁ జాలెడు కేలఁ
బాంచజన్యంబును పండుమెఱయ

(౧) చూ—విరాట్-౧-౧౨-

నుపయా త్రితటముతో నుద్దించునురమునఁ
గౌసుభంబను దివాకరుఁడు తోఁప
నాకలోకంబుతో నవ్వు పాపంబున
నాకాశనదియను నమ్రుతి మెప్ప

గీ. నమ్రుతిభారాకరము మాటలాడినట్లు
భాగ్యదేవత గింపు చేపట్టినట్లు
లలితగతినున్న సద్గుణాలంకరిష్ణు
విష్ణుఁగొంటిఁగంటి భవముఁ వీడుకొంటి.

(౨-౧౭౮)

అని యిట్లు స్తుతించి నమస్కరించి రయోనవిప్రపత్నులు పరమాంసము పునుకగిండియలోఁగడిగి పెట్టి యకుటిలభావములతోఁ 'కృష్ణా! నీకర్పితము, దేవా! అరగింపుము! సన్నెలికొనుము. నీకు భక్తిగాని కొండొకటి ప్రీతిగాదు.' అని వేఁడికొనిరి.

విధినిషేధములులేని నిర్మలజీవులు గదా వీరు. వీరు కేవల జ్ఞానులుకారు. భక్తిమాత్రము కలవారు. కావుననే 'భక్తిగాని నీకేమియు ప్రీతికాదనియుఁ బలికినారు. 'తొమ్మిద్రమ కొడుకుల' యను పద్దెములోఁ గలిగియున్న జ్ఞానము విశేషించి కానఁబడుచున్నది కాని వీరుమూఢభక్తి కలవారు. కావుననే శ్రీకృష్ణభగవానుఁడు

క. ... ... నవ్వుచు
నావేఁదుటు నూఱడించి యనుచితము మహీ
దేవునిఁ జంపుటయనుచుం
గై వెక్కిన వానిమేను కరమున నిమిరెన్.

ఇట్లు నిమురఁగా ఘంటాకర్ణునికన్నులు తామరరేకుల బలె

మెఱసెను. కాళులుపసుఁగుతొండములవలెనొప్పెసలారెను. మోము చందురుఁ బురుడించునదాయెను. భగవంతుని స్పర్శ యేమి యొనరింపఁజాలదు ? తరువాత వారిరువురును ఉన్నతపదవినొందిరని తెలిపి కవియానందప్రవాహమున నెల్లర నీఁతలాడించుచున్నాఁడు. మూలమునకుఁగొంచియుమువేఱు మాదిరిగా నీఘట్టము వ్రాయఁబడినది.

కాళుఁడీశ్వరుని వర్ణించు పద్యములఁజూతుఁము.

చ. కొలువఁగ నేరనిన్ను శతకోటి విభాకరతేజ పెగ్గలం
బిలువఁగనేరనిన్ను మునిబృంపవివేక విమర్శదూరునిన్
విలువఁగనేరనిన్నుఁ బృథివీవియదంతరభిన్ననేమిటన్
నిలువఁగదయ్య నాహృదయనీరజకర్ణికపై మహేశ్వరా
చ. ఒరసిరినిన్నుఁ శర్వనికషోపలధారల నన్నెఁగానరే ౫-౮
తరసిరి విశ్వముం గపిలధైనను నీదెసముల్లు సూపఁగాఁ
తెరసిరి బ్రహ్మముఖ్యులగు పెద్దలు బచ్చులు వోలెనెల్లవో
వెరసిరి గాని నిన్నెఱుఁగనేరరు నావశమే మహేశ్వరా
౯-౧౦

ఈపద్యములయందుఁ జక్కని భక్తిరసము తొలఁకుచున్నది.

ఇటులనే శ్రీకృష్ణుఁడీశ్వరుని స్తుతించు పద్యములును మిక్కిలి భక్త్యుద్రేకము భావగాంభీర్యము ప్రౌఢపదబంధముల చేనొప్పి యాంధ్రవాఙ్మయమున నున్నతస్థాన మలంకరించుచున్నవి.

ఈభాగము బహుళశబ్దాడంబరజుష్టమయినను, అపూ

ర్వములగు భావములతోనలరారు చుండుటఁజేసి, కొందఱని
నట్లు నీరసముగా లేదు. చాలమంది యీభాగమత్యుత్కృష్టముగాఁదలంచుచుండుట అసత్యముకాదు.

మిత్రసహునకుని కుమారుఁడైన జనార్దనుఁడను విప్రుఁడు జనార్దనుని సందర్శించినపుడు, అతనిభావముమాత్రము సరిగాఁజిత్రింపఁబడలేదు. ఆయెడఁ బ్రాఁతిఁపాలముననే పోయినాఁడు. హంసడిభకులకు దూరమైపోవఁదలఁచి శ్రీకృష్ణభగవానుఁడే శరణమనియెంచి యాతని పాసియు పాయని వాని మాడ్కి నాతని చెప్పినమాటలువిని సాత్యకితో వెనుదిరిగి పోయినాఁడఁట. ఇంకొకఁడెవ్వఁడయినను నిటులు రెంటికిఁజెడు రేవడయయి వెనుదిరిగిపోవునా? పాపమీతఁడు సాత్యకితో వెను దిరిగిపోయి, హంసుని చే, (౧) దిట్టఁబడి పరిత్యక్తుఁడు కాఁగా తద్భయంబున నేయరణ్యానికో పాఱిపోయి యచట దాఁగినవాఁడువోలెఁ బిదపడి గ్రంథములోఁ గానరాలేదు. ఈజనార్దనుఁడు ఉత్తమపాత్రము కాని హంసడిభకుల కాశ్రితుఁడగుటఁజేసి వారికనుయాయియయి దుర్వాసుని హంసడిభకులవమానించినపుడు వారితోఁ దనకలయికను నిందించికొనినాఁడు. కేవలము నిందించికొనుట మాత్రమే కాక, వారియెడ విరక్తుఁడయి వారుపోయినవెనుక నింటికిఁబోయినవాఁడు మఱలవారి సంధివచనములఁ గృష్ణునకెఱిఁగింపఁదలఁచి 'తీర్థముస్వార్థము' కలిసివచ్చినటులు సంతసించి

(౧) చూ. ౪-౧౮౪.

కృష్ణుఁడే శరణమని నమ్మి యాతనివద్దకుఁబోయి సాత్యకితో మరలివచ్చినాఁడు. ఆపైనాతనిసంగతి కవిమన కేమియు వినిపింపకుండుట వల్మీకి యూర్మిళాదేవ్యాదులసంగతిని రామాయణములో నిసుమంతయు వినిపింపకుండుటవంటిది.

దూర్వాసులు శ్రీకృష్ణభగవానుని సందర్శించినపుడు, వారిద్దఱసంభాషణము గడు ననురూపముగా నున్నది. ఆతఁడు భగవంతుని

సీ. ఏవెలుంగుదునిన్ను నేలనాతోఁపెన
వెషిమాయవలుఁబ్రహ్మ వేప్రెలుఁగు
రూపు రూపులలోనిరూపు తోఁచఫుఁగాపు
చూపనిరూపు నీరూపుచూపి
వేదాంతములకైన వెదకనందనిరూపు
విజ్ఞానరూపమై వెలయురూపు
తేజమైశ్వర్యంబుఁ దెలుపఁజాలెడురూపు
ప్రణవరూపంబుగాఁ బఱఁగురూపు
గీ. పంచభూతసుధాకర భాస్కరాత్మ
రూపమగురూపు నీరూపు రుచిరరూప!
మొఱఁగెడువెమాకు వ్రేళులమొదలుచూచి
చెట్టెలుఁగువారికాకులు చిదుమనేల?

(౪-౯౭)

ఇందు రూపులెక్కు కలిసిపోయినవి.

హంసడిభకవధానంతరమున మునులు శ్రీకృష్ణభగవానుని:

సీ. చక్రంబు మేదినీ చక్రంబు నేదేవు
దక్షిణబాహుసౌందర్య మొసఁగు
జలజంబు నొకపాణిజలజంబు నేదేవు
సవ్యభుజంబుతో సరసమాడు

రత్నంబుఁ గాని నీరత్నంబు నేదేవు
వక్షఃస్థలంబున వన్నెఁగాంచు
ఓనాంబు దానవాగ్న్యసనంబు నేదేవు
చరణపల్లవసమాశ్రయము నొందు
గీ. భానుమండలమును సుధాభానుమండ
లంబు నేదేవు కన్నుల లావునెసఁగు
నేదేవు నద్దేవునిఁ దెలియువారు
దేవదేవుని రూపంబుఁ దెలియువారు ౬-౧౩౬

ఇట్టులు ప్రకరణానురూపంబుగా స్తుతించినారు. ఈరేడు వర్ణించిన స్తుతులన్నియుఁ బాత్రములకుఁ బ్రకరణములకుఁ దగి మిగుల భావములతోఁ గూడినవై పాఠకుల హృదయముల ద్రవింపజేయును. ఈశ్వరుఁడు శ్రీకృష్ణుని స్తుతించునపుడు మతానురూపముగను (గూఢ) వేదాంతపరిభాషాయుతముగను నున్నవి.

ఇట్టి పద్యములఁ బండితరాముఁ దండకములుగా రచించి తాను కృతార్థుఁడగుటయే కాక పాఠకులఁగూడఁ గృతార్థులఁ జేసినాఁడు.

ii

పాత్రముల సంభాషణము—జనార్దనసందేశము.

ఈ ప్రబంధములయందుఁ బాత్రముల సంభాషణము, సుదీర్ఘముగాను, విపరీతముగాను, విసువుగొల్పునవిగాను నున్నవి గాని నాటకములవలె నాతిసంక్షిప్తముగాను, అనురూపముగాను నుత్సాహజనకములుగాను లేవు. అట్టులు వ్రాయుటలోఁ దిక్కన యాత్రి తేరినవాఁడు. ఇటీవలి కవులలోఁ

బింగళి సూరనార్యుఁడుతిక్కఁ గొండొకఁడు కానరాఁడని చెప్పవలయుటచే విచారముపొడముచున్నది. మన నాచన సోమనాథకవి హంసడిభకోపాఖ్యానమని వ్రాసినాఁడు కాని నమను నమనుమఁ గొలఁది కొలఁది మార్పులు చేయుచో నది 'హంసడిభకవధ' అను నాటకమగును. హంస డిభకులచే నవమానింపఁబడి, చినుఁగుగోఁచిపాతలతోను విఱిగినపిండములతోను బ్రద్దలువాఱిన కమండలువులతోను మోపులుగట్టి కూడఁబడ తెంచు శిష్యులతోఁగూడి చనుదెంచు దుర్వాసుఁడు ఈనాటకమునకు బీజము. హంసడిభకులు జనార్దనుని జనార్దనునికడకు దూత్యము నిర్వహింపఁబనుచుట బిందువు. నాయకి, హంసడిభకాదులతోఁ బ్రసంగించుట పతాక. ప్రాసంగికమును బ్రదేశస్థమునునగు చరితము ప్రకరి. హంసడిభకవధ కార్యము. ఇట్టి చక్కనిపంచసంధులతోఁగూడికొనిన యీశ్రవ్యకావ్యము దృశ్యకావ్యమును మించియున్నయది. ఏతాదృశకట్టములయందు, పాఠకులు ఆయాపాత్రముల సంభాషణములఁజదివి యాయాయిరసములందు వానిలోవారుగా లీనులయిపోవుదురు. ఈవిషాదాంతనాటకమునకు నాదిమసూత్రధారుఁడగు దుర్వాసోమునిపుంగవుండు, నిగ్రహాచారముచే నడవికి వేఁటవేడబమునఁ జనుదెంచి, దురదృష్టముచే నాశ్వన్యాయపరులుగావున మాధ్యందినసవనధ్వనిని విని తదుచ్చారణకుఁగడునలరి, యాశ్రమంబులఁజొచ్చి కొందఱుమునులఁజూచి వారికినమస్కరించి సత్కా

తులైన హంసడిభకులచే నవమానింపఁబడె,

క. మండఁగమండఁగ నార్చిన
ఖండితపేశములుఁ ద్రుటిలకాపినములున్
పండ్లముల తుండెములును గ
మండలు శకలములుఁ జూచి మఱనుపదోఁచన్ ౮-౨౫

గీ. మురవిరోధముం గట మోపుగట్ట
తేరఁబంచి సహస్రయశ్రవసులు
తోషరాసెంపవాఁడేన నిపచోట
నిలిచినిలిచి యహోరాత్రనిద్రమున ౮-౨౬

ఇటులు నడిచి రేపకడ, ద్వారకోపశల్యంబునఁ జేరియొక్క-క్కాలఁదునువార్చి వాకిఁటనిల్వఁగా, సంగజాతెలువచ్చి శ్రీకృష్ణ భగవానునికడకుఁ దీసికొనిచన్నారు. ఆయెడ శ్రీకృష్ణుఁడు, గోవనూడుచున్నాఁడు. అగోవము సాత్యకింగడఁచిపోవఁ గాలనుగేలనుఁమర్చి చిమ్ముచున్నాఁడు. వినోదైకపరాయణులయిన లోకులును కుమారులును వృద్ధులవృద్ధులై పెక్కురీతులఁజుట్టి యూడుచున్నారు. (ఇయ్యది నేఁటి ఫుట్ బాల్ మాచ్ కి సరిపోవుచున్నది.) దుర్వాసునిఁగాంచుకోఁడనే యాదవులందఱు నాసనాదిపూజ లొనరింపుమని యంతట నంతటరా శ్రీకృష్ణభగవానుఁడు, వినితుఁడై యతికిఁ బూజ లొనర్చి ప్రసంగమునందింపఁగా నాదుర్వాసఃపరివ్రాడ్విభుండు తనుబన్నములను, హంసడిచికులయుద్ధతిని వాకొన్నాఁడు. పిదపఁ దన యవమానకృతమును క్రోధమునకును దవుసటుః లెటులు చెప్పుచున్నాఁడో చూడుఁడు.

సీ. ఈకమండలు పంక్తి నెటుచూతునిట్లత
త్ప్రపకుసంబులు పగులకున్న
నీపంచనివహంబు నెటుచూతునిట్లత
ద్ఘూర్ణహస్తంబులు దునియకున్న
నీవల్కలవ్రాత మెటుచూతు నిట్లత
త్కృపటచర్మంబులు గాలకున్న
నీశిష్యసముదాయ మెటుచూతు నిట్లత
ద్వేషిణాంత్రంబులు ద్రెవ్వకున్న
గీ. నకట మోమోట లేక వారంతచేసి
గ్రుదికి పోయిరి "పులిపేపనడినఁ బసుల
వాండ్రెడెయొకాడ్రె" రనుకతవచ్చె నారు
మునులలోపల "నాలుక ముల్లు నిజ్జె"

ఇటులు తస్వాంధదసతి కనుకూలముగాఁ జెప్పఁగా నాతనిఁ గొంతకొంత తేర్చి, యావాసుదేవుండు 'దుర్వాసునివినోదంబుగాఁ గొందఱు యతీశ్వరులతో వాదంబుచేయించి బ్రహ్మతత్త్వనిర్ణయంబుఁ జేసి వారిచేత నుత్తరంబు లిప్పించుచున్నాఁడఁట.

అట్టి యెడహంసడిభకులు జనార్దనునిఁ బంపఁగా నాతడు శ్రీకృష్ణభగవానుని కడకువచ్చి.

గీ. ఉప్పుడాహంసడిచికులట్టినిరి మనకు
లవణమెంతేని నడుగు యాదవులచేత
వేగరమ్మనుశౌరి నియ్యాగమునకు
నావుడుంబనివూనితి దేవదేవ ౪-౧౫౭

అని తెలుపఁగా శ్రీకృష్ణుండు రోసంబునకు మూలంబైన హాసంబుచేసి యిటులనుచున్నాఁడు.

తటివానింగొని శస్త్రమూని సమరోత్సాహంబు పైనెత్తిన
చ్చుటకుంగొందునె వీఁపు సక్కనయి నిల్చుంగాక మీసైన్యముల్
[ఉద్యోగ-ద్వితీ-౧౭౮]

ఈపద్యములఁజదివిన నెట్టియుద్వేగము కలుగునో యట్టి యుద్వేగ మీఘట్టముఁ జదివినఁ గలుగుచున్నది. పైనుద్యోగపర్వమునఁ డెలిఘట్టము చదువుచుండఁగా రామయ్యగారను నౌకరు రసపారవశ్యమున నెదుర దుర్యోధనాదు లున్నటులు తలంచి సమీపముననున్న స్తంభమును దన భుజముతోఁ దాఁకఁగా నాయిల్లంతయు గడగడలాడిపోయినది. ఈ ఘట్టముకూడ వారికి వినిపించి రసతారతమ్యము తెల్పవలసియున్నది.

హంసుండు చనిపోయిన తరువాత యమునాజలంబుల లోన వానిఁగానక డిభకుండేడ్చు నేడ్పు కరుణారసమునకుఁ గమనీయరూపముగాఁ గానఁబడుచున్నది.

సీ. నాయొల్లనీఁడన నడచె కేమేలుడు
వనుఁగావు నడిచి సాయమ్యో నన్న
దేవేంద్రునకు నైనఁ జేతఁ జూపఁగరాని
గారవోన్నతి నిటఁగాంచె నన్న
పార్వతీపతిచేతఁ బడసిన దివ్యాస్త్ర
భూరిసంపద నెల్లఁబోయె నన్న
వలరాజునకు నైన వన్నెఁగాంచిన
తనువిలాసం బేలుకొనియె నన్న
గీ. యన్న నీయట్టియన్న నన్నను దినంబు
గారవింపఁగ నుండఁడే నేఁకేందునింక

నింకఁ జాల నెవ్వగలచే నిటనిటఁగ
నాకు నేలనితోడిక్క లేకయున్న [౪-౩౦౦]

ఇటులు మిక్కిలి యనురూపముగా నీయుపాఖ్యానమును రచించినాఁడు. యశోదయు నందుఁడును శ్రీకృష్ణుని జూడరాఁగా పాత్రీకృతుండగు గొల్లఁడను గుసాయిలు అడిగినాఁడు.

ఇటులీయుపాఖ్యానము మిగుల మనోహరముగాఁ జిత్రింపఁబడియున్నది.

ఛాయవలె ననుసరించినాఁడు. కొన్నియెడల సోమనాథుని భావములను బదములను గూడ ననుకరించినాఁడు మఱియు నెన్నఁడయుఁ గొన్ని స్తోత్రములు మూలేతరముగా నెందులకో (౧) వ్రాసినాఁడు చూడుఁడు. నాచనసోముఁడు మూలానుసారముగా

మ. "చనివారంబులు దేవతారచిత నందనోద్యానపుష్పాంతిక స్థలం (౨)
బున నాస్నానముఁ జేసి చొచ్చి మనముప్పొంగంగ "దాశార్హ" నా
వినుతింపంబడెందు సభల... ... " ౧-౧౦౮
(సా దాశార్హీతి విఖ్యాతాసౌ జనార్దనసుపూజితా)
౨౧౫-అధ్యా౨౪

అనియిట్లు రచింపఁగా, ఎఱ్ఱన;
గీ. అతఁడు.....సుధర్మాఖ్యయగు" ౪-౬౭
అనిమూలేతరముగాఁ గ్రొత్తత్రోవఁ ద్రొక్కినాఁడు. నాచనసోముఁడును భాగవతమునకు మహిమ్నమైన మార్చినాఁడు. దీనికుపపత్తి విచారింపవలయును.

రెండవయాశ్వాసము.

నాచనసోముఁడు నలుబదియెనిమిది యధ్యాయములవఱకు నూటడెబ్బదియవయధ్యాయమును రెండవ యాశ్వాసమాత్రకగా జేసికొన్నాఁడు. ఏతత్పూర్వము మూలముననున్న నలుబదియెనిమిది యధ్యాయముల నించుమించుగా నూటముప్పది పద్యములలో గుక్కపట్టి నాచనసోముఁడు తనకు దొరకఁడేమోయని భీతుఁడైనాఁడోయనఁ బరుగుపరుగున వచ్చి కలిసికొనినాఁడు. "శ్రీకృష్ణునియొద్దకు నొకబ్రాహ్మణుఁడు వచ్చి తనకుమారుని రక్షింపవేఁడుట, అర్జునుఁడు విప్రరక్షణార్థము తానరుగఁగోరుట, నిజకుమారుని యముఁడపహరింపఁగా బ్రాహ్మణుఁడర్జునునిదూఱుట, విప్రకుమారులఁబ్రతికించు

(౧) ఇట్టిశ్లేషములుండుట వల్ల మూలము చాలఁ బాఠభేదములతో నింపఁబడినదని యూహింపనగుచున్నది.

(౨) మూలమున "దాశార్హీ" యనీకారాంతముగా నుండ సోముఁడు టాబంతముగాఁ జేసినాఁడు.

టకై కృష్ణుఁడు పార్థసహితముగాఁ బోవుట, కృష్ణుఁడు విప్రకుమారుల దెచ్చియిచ్చి ద్వారకకు వచ్చుట అనువిషయములు వర్ణించిన, ౧౭౦-౧౭౪ అధ్యాయములను నించుమించుగా నలువదియైదు పద్యములలో నిమిడించినాఁడు తరువాతిభాగమున ౮౦ యధ్యాయములవఱలి ౨౬౪-౨౮౧ అధ్యాయములయందలి విషయమును, రెండవయాశ్వాసము తుట్టతుదవఱకు తెలిఁగించినాఁడు, ఎఱ్ఱాప్రెగ్గడయు నాచనసోముని రీతినే పూర్తిగా ననుసరించినాఁడు నాచనసోముఁడీయాశ్వాసము, ఘంటాకర్ణునికథలో బసవంతేములగు కొన్ని విషయములఁ దెలిఁగింపమానినాఁడు గడ్డికాప్రవాహన్యాయమున నాచనసోమనాథునినే యెఱ్ఱాప్రెగ్గడయు ననుసరించినాఁడు. మూలమునందలి౭౩-౭౭ శ్లోకముల సోముఁడు తెలిఁగింపలేదు. ఘంటాకర్ణుఁడని యెందరుకుఁ బేరువచ్చినను తెలుఁగు నేమ ఖ్యవిషయమును వదలుటలో బీజము చింత్యము.

“తస్మాత్ కృష్ణా భగవన్ ! యదిదోషో నవిస్యతే
ఇత్యుక్త్వా విక్రృతంభూయో విహస్య స తు కామతః”

[247-7]

ప్రకృత శాస్త్రమునకు మిక్కిలి యౌచిత్యమును బోషించునీ భావముసోమనాథుఁడువదలినాఁడు. “నృత్తగానసంగీతములయుఁ బ్రాంతి గాదు” అని నొడివినాఁడుకాని యీసామసుదాన లేదు, ఎఱ్ఱాప్రెగ్గడయు నీతోవనే యరిగినాఁడు. ఇట్టులనే రెండువందల డెబ్బది నాలుగవ యధ్యాయములో:-

ఇత్యుక్త్వా భగవాన్ కృష్ణస్తత్రాప్య బ్రాహ్మణంతదా
తేనస్తుతో జగన్నాథః పూజయిత్వాచతంద్విజం. 30
తతో విసృజ్య గోవిందస్తస్మాద్దేశాదుపాగమత్”

మిక్కిలి సంతోషమునొసఁగూర్చు నీవిషయమును వినిపింపక సోమనాథుఁడు తననుచరుఁడగు నెఱ్ఱాప్రెగ్గడయు ననుచితమొనరించినారు.

ఈయాశ్వాసమునందలి హరిహరాత్మకస్తవ మీఘట్టమునఁ

గాక బాణాసుర కథయందుఁగలదు. మూలమున నొకయధ్యాయము వంశంతయు వ్యాపించియున్న హరిహరాత్మక స్తవము నీతఁడు రెండు సీసములుగా, అత్యంత రమణీయముగా విరచించినాఁడు. విచారింపఁగా నాశ్వాసాదిని హరి హరులఁ గూర్చి మునివరులు మునులను గొనుటయు నా బాణకథాంతర్గత హరిహరాత్మక స్తవము నిచటఁ జేర్చియున్నాఁడు. ప్రతిపోటను సీసములిననుపరించు నేతా పెర్గిన హరిహరాత్మక స్తవము నీకథా ప్రసంగమున నే మూలాను సరణంగా గా నొక సీసము నొక కందముగా రచించినాఁడు. మూలపుస్తక శేషములచేఁగాని యుత్తమాలుపేకలుఁగఁ జాలు ఇంపకృష్ణుడు హేతువుకానఁబడినఁగాని యీయభిప్రాయము మారుచుటకు వీలు కలుగదు

## మూఁడవ యాశ్వాసము.

మూలముననున్న ౧౦౪ వ యధ్యాయము మొదలుకొని ౧౦౮ వ యధ్యాయము వరకున్న విషయము మూఁడవయాశ్వాసములో, నూటనెనుబది పద్యములలోఁ దెనిఁగించినాఁడు. ఇటుతరువాత శ్రీకృష్ణుఁడు రుక్మిణీసత్యభామలతో జూదమాడుట కాశీపతి ద్వారకపైఁ గృత్యను బనుచుట శ్రీకృష్ణుఁడు కృత్యపైఁ జక్రమును బంపుట యను విషయములు మూలమునఁ గానరావు ఏతావతా శ్రీకృష్ణుఁడు సుదర్శనచక్రంబుచేఁ గాశీరాజసుతప్రేషిత యగుకృత్యం దునుముట యను శిష్టకకర్మం నిరువదిరెండు పద్యవచనములలో వ్రాసినాఁడు. ఏలాగో, మూలములోఁ గానరాని చాల విషయములలో నిరువుర రచనలు సమానములుగా నుండఁగా నీవిషయమునందు చాలభేదము గానున్నది. భేదము తెలియుటకై క్రిందనుదాహరించుచున్నాఁడను.

ఉత్తరహరివంశము- ఆశ్వా ౩- ౧౩౧ మొదలు ౧౫౦వఱకు
హరివంశము- ఉత్తరభాగము- ,, ౬- ౨౧౮- ౨౬౭ ,,

శబ్దరత్నాకరకారుఁడు లోనగువారు, అత్యుత్తమమని కొండాడిన కొన్నిపద్యములే కాక భావములోఁ గూడ నుత్తమములు, అర్థమింకను దెలియరానివి చాలఁబద్యములీయాశ్వాసమునఁగలవు కృష్ణు

డు రుక్మిణీ సత్యలతో జూదమాడు పట్టున విరచించిన పద్యములకు నర్థము తెలవలసియున్నది. శబ్దరత్నాకరమున నాపదములకుఁబ్రవేశము కానరాదు. ఈయాశ్వాసమున నేకలవ్యయుద్ధావసరమున విరచింపఁబడిన,

సీ. వంకదారకుఁజేరి వాఁకట్టిపడెం
బులుసెర్చి కొమ్ముల మోరికుపైచి
పారిఁకిలోఁబఁజొచ్చి సలుగాఁడెఁగెలచిన
పంతెకాడ్లను మున్నబ్రిచ్చిపరుల
తోనవిచ్చిన లెక్క లోనగొత్తిళములోఁ
బురణించి వచ్చినపోటుమగల
వాఁడిమెచ్చికె యాదవవరమాఁపఁబోశిల
వారఁదాఁకించిన వాసిబిరుదు
గీ. లచ్చెరువు లొంపమేపలు సొచ్చియాగ్చ
దొట్టకాడ్లచేఁ బడిపోయెఁదుర్యోధిక-
తాలవాటులనేటుల యంతుమిగిలి
తళిమిరచ్చటిబలము కొంపలు గమంగి. ౩౪

ఇట్టి యసమాల్యములగు పద్యములకు మూలమున విషయమింత యున్నదేమోయని పరిశీలింపఁగాఁగానరాదు

కుతాశ్చ స్వర్వతశ్చైవ ఉచ్ఛ్రితః పాంప్రకాశయా
ప్రాకారాంశ్చైవ సర్వత్ర ప్రాసాదాన్ వరసంచయాన్. ౭
అథతత్ర మహాన్ శబ్దః ప్రాదురాసీత్ సమంతతః
టంకేషు పాత్యమానేషు ప్రాకారేషు మహాబలైః. ౮
పూర్వద్వారే మహారాజభిన్నాః ప్రాకారసంచయాః

ఆతని కాలమునందలి తెలుఁగు రాజులుకట్టుకొను దుర్గములు మొదలగునవి యిట్టులుండునేమో యని సంశయముగానున్నది. అది తెలుఁగు రాజుల కాలము కావున నాయాయిపదములు వాడుకలోనుండి యుండును. (క్రీడాభిరామమున ౧౧౧ వ పద్యము చూడుఁడు.)

## నాలుగవ యాశ్వాసము.

౧౬౦ వ యధ్యాయమునుండి ౧౭౪ యధ్యాయమువఱకు ఉన్న విషయమును నాలుగవ యాశ్వాసముగాఁ దెలిఁగించినాఁడు ఏల ప్రేఁగిపి యీ హంసడిభకోపాఖ్యానమును పన హరివంశమునఁ దెలిఁగింపక విడిచిపెట్టినాఁడు దీనికిఁ గారణ మారయవలసియున్నది. మూలమున హంసడిభకోపాఖ్యాన మని యుండఁగా తెలుఁగున హంసడిచికులనియు డిచికునకు డిభకుఁడనియుఁ గొన్ని కొన్ని పద్యములలోఁ గలదు. హేతువు విచారింపవలసియున్నది. ౧౬౭ వ యధ్యాయమున, ౩-౬-౧౧-౧౬ శ్లోకములందలి సకరుణమైన భాగము రచింపక సాహిత్యరసపోషణమై తన సొంత సర్గన పెట్టినాఁడు కాని యవి గట్టిబిగిసి దుర్భషములు గానున్నవి.

ఈయాశ్వాసములో ౧౮౩ వ పద్యమునుండి ౧౯౧ పద్యము దాఁకనున్న విషయము మూలమునఁ గానరాదు. మూలమున ౧౭౩ వ యధ్యాయము వేదాంతపరముగా నుండఁగా సోమనాథుఁడు సాహిత్యరసపోషకమై సొంతసర్గనలతోఁ బ్రాసి భూయిష్ఠముగా వ్రాసినాఁడు

## పంచమాశ్వాసము.

నూటడెబ్బదియైదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిదవ యధ్యాయమున డెబ్బదియారు శ్లోకముల వఱకునన్న విషయమును పంచమాశ్వాసముగాఁ దెలిఁగించినాఁడు నూటడెబ్బది యెనిమిదవ యధ్యాయమును (ఆశ్వాసము) తెలిఁగింప మానినాఁడు. ౧౭౭ వ యధ్యాయమున

చిత్రలేఖావచశ్శ్రుత్వా సోఽనిరుద్ధ ఉప్రపీడమ్
దృష్ట్వాస్వప్నే మయా సా హి తన్మాత్రః శ్రుణు శోభనే ॥ ౧౬౭॥
రూపంకాంతిం గతించైవ సంయోగం రుచిరాంతథా
ఏవంసర్వమహోరాత్రం మహ్యాని పరిచింతయన్ ౧౬౮
యస్యాహంసమనుగ్రాహ్యోయది సఖ్యంత్వమిచ్ఛసి
నయస్వచిత్రలేఖే మాం ప్రష్టుమిచ్ఛామ్యహంప్రియామ్ ౧౬౮

ఈప్సితంతస్య విజ్ఞాయసానిరుద్ధస్య భామినీ
చిత్రలేఖా తతస్తుష్టాతేగ్ బచతమబ్రవీత్. ౧౫౦
ఈశ్లోకములఁ దెలిఁగింపమానినాఁడు.
మూలమున,
దేవదేవంసువపుషం స్రగ్విణం రక్తవాససమ్
హారం సహోమంవరసం రచయంతి మనోరమా. ౧౭౬-౬
అనియుండఁగా,

సీ. సుడిగొన్న చిగురాకు జొంపంబు కెంపారు
తలమీఁప నుల్లి కాదానుచూపఁచి
నిడుపతావారతూఁడు నెట్టింబు చుట్టిఁ
బటికంపుఁ గడియంపు భాగమదమి
తోనయాక్రేవఁ జెంద్రావ తొకుహత్రంచి
మెడచక్కఁ గస్తూరి (మెఁచి) మేదిపూసి
సౌరు (యఁ)గొమ్మల నల్లపట్టుపగిల్చి య
క్కనయానుప్పై నెంపికోరవెట్ట్రి

గీ. ఘనళికేతక (క్రీ) ధూళిగాత్రముసఁ జెరివి
మోకమామీఁది కొకకాంతి మొక్కనిలిచి
యుపెలిలోఁ జక్కఁ సగము నాకొసఁగుమనుడు
నద్రికన్యక తలవాంచె హరుఁడు నవ్వె. (౫-౫౧)
ఇటులు మనోహరముగా యాత్ప్వె వ్రాసినాఁడు.

ఈయాశ్వాసమున, ౪౩ మొదలు ౭౭ దాఁకనిర్మూలము, హరివంశమును కీనికిఁబుత్రికయగుటచే నేపవయాశ్వాసము ౫౫ మొదలు ౭౨ దాఁక నిర్మూలము. నిర్మూలకములయిన ఈ రెండుగ్రంధములలోని శృంగారము పచ్చిగా నున్నది ఇంతియకాక యుషపార్వతి దగ్గఅనున్నటులు మూలమున నుండఁగా, ఈరెండుగ్రంథములును నామెను గేటాయించుచున్నవి. తరువాత, ౨౭౭వ యధ్యాయమున ౨౩-౨౪-౨౫- శ్లోకములలోఁ జక్కని శిల్పాభివర్ణనముగల యనిరుద్ధగృహము పాఠకుల హృదయము కట్టెదురనుండు

ము కవిత్రయమువారి భాషాంతరీకరణమువలెఁ గొన్నిచోటుల మూలానుసారిగాను కొన్ని చోటుల నిర్ముక్తలకముగాను గానఁబడు చున్నది. భాషాంతరీకరణము కొన్నిచోటుల సాహిత్య రసపోషకమై దీర్ఘసమాసభూయిష్ఠమై గూఢగ్రంథపదప్రచురమై రసయుక్తమయి యున్నది. కవిత్రయములోనొకఁడగు నెఱ్ఱాప్రెగ్గడ యంతటి వాఁడు చాలఁ జోటుల నీతని ననుసరించిన వాఁడైన నీతనిని మాటలఁ గొండాడి సక్కఁజాలేగు ఈతఁడు ఏమియును నన్న భావమును బైకొని దానికి మంచిభాసను దొడిగి, తెనుక్రొత్తరకపు బంగరు మొలామును బూసి ప్రబంధమును దుకాణములోఁ జూడక విక్రయములకిమ్మును గాని ఉన్నదాని నున్నటులనుంచి యప్రియమ్మునుగాఁ బోషించిన యలఁతి యలఁతి తునియలతోఁ గూర్చి మాత్రము తెలుపుచుఁగాఁ గానుపింపఁజేయఁడు ఇట్లని యీమార్గమితనిం దెలియపనరాదు కాని సాహిత్య రసపోషకమైన ప్రౌఢశైలియే యాతనికి నలిగిన బాట కాన వేఱొండు త్రోవ ద్రొక్కలేఁడనియు చెప్పనగును.

ii

“సోముఁడు హరివంశము వ్రాసినరీతి”

నాచన సోముఁడు హరివంశమునందలి కొన్నిభాగములలోఁ గొన్నికథలమాత్రమే తెలిఁగించుటయు పూర్వప్రకరణమువలన మన మెఱిఁగియున్నారము. ఏహేతువుచే సతడు మనకుముందు కొన్నికథల నీతఁడు వదలవలసివచ్చెనో యని మనమిప్పుడు విచారింపవలసియున్నది. హరివంశమును బురాణరీతిగాఁ దెలిఁగింపవలయునని నాచనసోమునకు లేదు. కావుననే పూర్వభాగమునను దెలిఁగింపమానినాఁడు. ఉత్తరహరివంశశైలియుఁ బురాణమునకుపయోగపడుశైలి కాదు. కవి పురాణమున కొకశైలియుఁ బ్రబంధమునకొక శైలియు

నాటకమునకొక శైలియుఁ గూర్పునకు కావున నీతని శైలి ప్ర
బంధమునకుఁదగి ప్రౌఢభాషాయుక్తమయి గంభీరమయియు
న్నది. ప్రబంధమును మించియున్నదికాని యందుఁబలె సుల
భముగా నెఱుఁగఁదగిన పురాణముకాలేదు. ఇట్టివిదో
నీతని గద్యము;

"ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన వి
రాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతకథానంత
రంబున"

అని వ్రాసికొనుటచేఁ దన శైలి మహాభారత శైలి,
యందును తిక్కనతోఁ దులతూఁగునటులు వ్రాసికొను
టచేఁ బురాణ శైలిలోనే వ్రాసినాఁడని కొందఱనినను, ఆగ
ద్యమునందే,

"శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధాన
చక్రవర్తి"

అనియుండుటచేఁ దనసాహిత్యరసపోషణ సంవిధానచక్ర
వర్తిత్వము పరిపూర్తిగా నుపయోగించి యుత్తరహరివంశ
మును ప్రబంధముగాఁ దీర్చినాఁడు.

ఈకథనే ప్రబంధముగా వ్రాయవలయుననుకొని వ్రాసి
నను బురాణముగా వ్రాయవలయుననుకొని వ్రాసినను
దాను సాహిత్యరసపోషణసంవిధాన చక్రవర్తి కావున నిపు
డున్న యుత్తరహరివంశస్వరూపమే యేర్పడును.

సోమునకుఁ బూర్వముననున్న కావ్యములు.

ఆంధ్రీకరణకాలములో ననఁగా నాదికవులకాలములోఁ

ఇతనికిఁ బూర్వమున, రాజశేఖరకవిప్రణీతమగు విద్ధసాల భంజికకాంధ్రీకరణమయిన కేయూరబాహుచరిత్రము, తిక్కన నిర్వచనోత్తరరామాయణము, కేతన దశకుమారచరిత్రము కాదంబరి, కన్నెచోడుని కుమారసంభవము ను తెలుఁగులోఁ బురాతనము లు. కాళిదాసుని ప్రబంధము లు భారవి, మాఘ కావ్యము మొదలయిన పెక్కు కావ్యములు, నాటకము లు కావ్యప్రకాశము మొదలగు నాలంకారిక గ్రంధములును బురాతనములు. ఇవికాక తెలుఁగున నత్యుత్తమకావ్య మన నొప్పు శ్రీమహాభారతమునందలి విరాటపర్వము నందలి కీచకవధఘట్టమును నిర్వచనోత్తరరామాయణము సోమునకుఁ బూర్వమున వెలసిన నెయ్యలరారు చున్నవి.

ఉత్తరహరివంశము ప్రబంధము

ఎడనెడ కొలఁది కొలఁది కతలను వీఁడి మూలమునుండి బ్బిబ్బిగాఁజేసి రసాయనములగు విషయముల మాత్రమే కైకొని యొక చిన్న ప్రబంధమువంటి దానిఁగాఁ జేసె నను గొన్ని హేతువులచే దీనినిఁ బూర్తిగాఁ బ్రబంధమని చెప్ప వీలులేకయున్నది. తాళపుస్తకమునందు

క. శ్రీ సర్వమంగళా కుచ
వాసంతీ వకుళ గంధవస్వనమ లా
వాసుకివిలాసవేష
వ్యాసమునిమనోనివాస హరిహరనాథా!

అనునీపద్యమే మొదటనుంచుటజేసి కవి పీఠికవ్రాయనటులును బూర్వభాగము వ్రాయనటులును దోఁచుచున్నది.

పుస్తకమునకు, ఉత్తరహరివంశము అని పేర్పెట్టుటచేతనే పూర్వభాగమిందు లేదని విస్పష్టమగుచున్నది.

నేను వెంటనే తంజావూరిం బోయి యాపుస్తకమును జూచితిని గాని యది యవతారిక మాత్రము లేక పూర్ణముగా నున్నను

అని కందుకూరి వీరేశలింగముగారును వ్రాయుటజూడఁ గవి సంస్కృతకవులరీతి

ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్

అనియుండుటచే నాశీరూపమయిన 'శ్రీసర్వమంగళాకుచ' యనియే ప్రారంభించియుండును. (ఒకవేళ వ్రాసియుండిన నశించియుండవోపును.) కుమారసంభవము మొదలగు తత్పూర్వ ప్రబంధములలోను భారతమునఁ గూడఁ గవిచరితము మొదలయిన కొన్నివిషయములు పీఠికారూపముగా రచింపఁబడియున్నవి. ఆవిషయమిందు లేదు. ఈవిషయము లిందులేకపోవుట వలనఁ గొండిజుసంస్కృతకవులతోవఁ ద్రొక్కినాఁడని యనుకొందము. మహాభారతమునఁ గలుగు నెంచి పరీక్షిష్ట ముగా లోకముగ్రహించుఁగాక యనుమానపుఁ బనులు నిటులు పీఠికమానియుండును. మహాకావ్యములలోఁ గండవలసిన లక్షణములని లాక్షణికులేకరువుపెట్టినరీతిగా నగరశైలాదుల వర్ణనము మూలాతిరేకముగా నీతఁడు వర్ణించుటజేసి దీని ప్రబంధమేయని చెప్పఁజూచినను గొన్నిపురాణములను నీరీతిగా నీవర్ణన కలదు కావున నదిమాత్రము పూర్తిగా హేతువని సిద్ధాంతము చేయవీలులేదు.

అని యున్నది. నాచనసోముఁడు సకలభాషాభూషణుఁడు సాహిత్యరసపోషణ చక్రవర్తి కావునఁదన సాహిత్యమును బూర్తిగా ఉత్తరహరివంశమునఁ బ్రకటించికొన్నాఁడు. ఈవిషయమునే కందుకూరి వీరేశలింగముగారును దమకవుల చరిత్రలో;

ఎఱ్ఱాప్రెగడ చేసిన హరివంశము పూర్వభాగముగా నుండుటేకున్న యభిప్రాయముతో నీతఁడీయుత్తర హరివంశమును రచించినట్టు కనఁబడుచున్నది. ఇంచుమించుగా నెఱ్ఱనయు సోమనాథుఁడు నేకకాలికులు గనుక శంభుదాసుని కవిత్వమునందీతని కంతగౌరవము కలిగి యుండదు కపోవచ్చును సోమనాథుని కవిత్వము మిక్కిలిప్రౌఢముగాను సర్వవిధముల నెఱ్ఱాప్రెగడ కవిత్వమున కంటె మేలైనదిగాను ఉన్నది. ఒక్కయెఱ్ఱాప్రెగడకవిత్వమేకాదు. భారతమును రచియించిన కవిత్రయలోన నెవ్వరి (?) కవిత్వమును గొన్నివిషయములలో సోముని కవనముతో సరిరాదని నాయభిప్రాయము. ఇతనికవిత్వపటుత్వసంపదను బట్టి యీతనికి సర్వజ్ఞుఁడను బిరుదుపేరు వచ్చినది.

ఆంధ్రకవులచరిత్రము. పుట 116 (తొలికూర్పు)

అని వ్రాసినారు. ఈతఁడు గద్యలో—

ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతకథానంతరంబున

అని వ్రాసికొనుటచేఁ దిక్కనయందుఁ జాలగౌరవము కలవాఁడయ్యెను 'అర్థమునకుఁ దగియుండెడు మాటలు గొని కథార్థంబు సుస్థితపూర్వాపరమై యలఁతి యలంతి తునియలుగ' నుండునట్లుమాత్రము కవిత్వము నలవరించిన వాఁడుకాఁడు. చాలఁజోటులఁ దిక్కన వలెనే యలఁతి

యిలంటి తునియలతో నే వ్రాయును గాని పూర్వమునుండి యలవడిన సమాసశైలియే యీతనికిఁ బ్రవహించు చుండును. ఈవిషయమే తాను గద్యలో వ్రాసికొన్న 'సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి' యను సమాసమునఁ దాండవమాడుచున్నది. [సహితానాం భావః=సాహిత్యమ్) సహితముల భావము సాహిత్యము. అట్టియన్వర్థమైన సాహిత్య మీతనికిఁ గలదు. ఈతఁడు పెక్కుశాస్త్రములనధ్యయనముచేసినట్లును గొప్పకాల్పనికుఁడయినట్లును, పెక్కుపద్యములవలనఁ జక్కఁగా దెలియనగును. ఆతనికాలమున సుప్రసిద్ధములయిన కావ్యములలోఁ బరిగణింపఁబడుచున్న భారవి మాఘాది కావ్యముల రీతిఁజూచి వానివంటి శైలిని గల్పనలను బుచ్చికొని యీతఁడును మిక్కిలి ప్రౌఢముగా ఉత్తరహరివంశమును రచించినాఁడు. రసమునుగూడఁ దానన్నిటులు చాలఁబోషించినాఁడనుటలో నెంతమాత్రమును సందియము లేదు. ఇటీవలివారందఱు ప్రబంధములందు, ఈతఁడు పోయినశైలిని గొందఱును ఇంతకును గట్టిబిగిసి (రసముమాత్రము లేదు) కొందఱును రచనలఁజొప్పించినారు. శ్రీనాథుని కీతని శైలియే మాతృక. ఈగ్రంథమును, శ్రీనాథునిగ్రంథములను ముందుంచి చూచినచో నీవిషయము తెల్లముగఁ దేటపడును. శ్రీనాథుని యనేకపద్యములలో నాచన సోమనాథుఁడు కానఁబడును.

నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు

శ్రీనాథునిఁబోలెఁ బ్రౌఢమనోహరంబుగాఁ గావ్యములు నిర్మిం
చిన కవులాంధ్రమున లేరని యొకింతగట్టి యొక్కడైనను జెప్పవచ్చు
నని నాభావము. ఇట్లుండఁ జిన్నయసూరియు సీతారామాచార్య
లును వీరేశలింగంపంతులుగారును నాచనసోముఁడ కవిత్రయము
వారికంటె సుకృతిశ్రేష్ఠునిగాఁ జెప్పుట యతిశయోక్తియని తలంచెద.
ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశముతో నేవిధంబునను బోలనేరని యుత్తరహ
రివంశమును రచించిన సోమనాథుని కట్టియున్నతపదవినొసఁగ నా
మనస్సు గొలుపదు. ఈయిరువుర కవిత్వంబులం గల తారతమ్యంబులను
బ్ర॥ శ్రీ॥ అనంతకృష్ణశర్మగారు ప్రకటించిన యుపన్యాసములో
నతివిపులముగాను సయుక్తికముగాను ప్రదర్శించియున్నారు.
దానియందరయునది. కృష్ణదేవరాయలు శ్రీనాథుని కావ్యములకు
సరిరాని యొకమనుచరిత్రమును వ్రాసిన పెద్దనకవిత్వపటిమకు సం
తసించి యాంధ్రకవితాపితామహుండను బిరుదు నొసంగఁగదా.
ఆరాజన్యమూర్ధన్యుని యాస్థానంబున శ్రీనాథుఁడుండి తనగ్రంథ
ముల నతనికంకితము చేసియున్నచో నెట్టిబిరుదము నొసంగియుండు
నో తెలియరాకున్నది. నాచనసోముని కవనము సర్వవిధములను
గవిత్రయము వారికవనమునకు శ్రీనాథుని కవనమునకును సరిరాదని
యే నాయభిప్రాయము. సోముని కవనంబుకంటె శ్రీనాథునికవ
నము చాలామేలైనదనితలంతు. ఈవిషయమై నాయభిప్రాయంబున
బ్ర. శ్రీ. వేదము వెంకటరాయశాస్త్రిగారును. బ్ర. శ్రీ. రాయదుర్గ
ము నరసయ్యశాస్త్రిగారును నేకీభవించియున్నారు. కీ॥శేషులైన
శతఘంటము వేంకటరంగశాస్త్రిగారి యాశయంబునిదియ.

ఆంధ్ర–సాహి–సం–6–7

అని యిట్లు వ్రాసియున్నారు. ఈవ్రాఁతలోఁ జాలసత్య
ములేకపోలేదుగాని విడిగా నుత్తరహరివంశమును జదువుచో
నాచనసోముఁడు శ్రీనాథునికంటె గొప్పవాఁడనియుఁ దన
తరువాతి వారందఱకు మార్గదర్శియనియుఁదోఁచును.

బమ్మెర పోతనలోఁగూడఁ గొంతకొంత నాచనసోముఁడధి ష్ఠించియున్నటులు స్పష్టముగాఁ గానవచ్చును. వేయేల ? ఇట్టీవల నుదయించిన ప్రబంధకవులందఱకు నాచనసోముఁడు మార్గదర్శియని చెప్పనగును. ఈతనికై లియే పరిబంధకవు లలో గూఁటి వారివారి యసమర్థతచేఁ బ్రకృతమునను న్న పాకమై లికి దిగుటకు హేతువై నదని తలఁతును. ఈతఁడాది కవులలోనివాఁడై నను, ఆదికవులకును మధ్యకవులకుఁ గొందఱకును మాధ్యమికుఁడు గానున్నాఁడు. బమ్మెర పోతన భాగవతములో నాచనసోముఁడెత్తికొన్న విషయములు చాలఁగలియున్నవి ఆతండు భాగవతమునుబట్టి పోవు వాఁడు కావున నైలిలోనే విశేషముగా నైక్యముడు గని పట్టవలయుఁగాని భావములలోఁగాదు. ఐనను నరకాసుర సంహారఘట్టమున.

మ. కనియెంబుణ్ గొనయింబు ... ఉ త్త-హరి.
మ. అరిఁజూచుణ్ హరిఁజూచు ... ,,

ఈ మొదలగు పద్యములలో (రెంటికివిషయమేకమయి నను పదములు కలియవలసిన యవసరములేదు.) ప్రదేక్యము భావైక్యము కానవచ్చుచున్నది. శ్రీనాథుఁడును నాచనసో ముని పద్యములవంటి పద్యముల ననేకములరచించినాఁడు.

మొనమొన్నటి కనుపర్తియబ్బనామాత్యుఁడు భాగవ తముననుసరించి యనిరుద్ధచరిత్రమును రచించినను నాచన సోముని భావములుకొన్ని దానఁగానవచ్చుచున్నవి. ఇంతి

యనాక కవిత్రయములో నొకరుడునులోకో త్తరుడయిన కవియగు నేఱ్ఱాప్రెగ్గడ చాలజోటుల నీతనిభావమును బద ములను మాటుకొనియున్నాడు. ఇంతియకాక మూల ములోలేని విషయములంబాలనాచన సోముడు వ్రాయగా నావిషయములనే యూనపూర్వగా ఏఱ్ఱాప్రెగడయనుకరిం చినాడు. ఇంతెమంది మహాకవులచే ననుకరింపబడిన నాచన సోముడు, అందులో నేఱ్ఱాప్రెగడచే ననుకరింపబడిన సోముడు మహాకవియని యనుటకు నేమిసందియము? ఈ సోముడు సోమునిరీతిగా నాంధ్రసాహిత్య రాకానిశీథిని యందు షోడశకలలతో వెలుగొందుచున్నాడు.

iii

సోముని కూరుపు

పూర్వప్రకరణమున సోమునికూర్పు చాలప్రౌఢమైయు న్నదని తెలియజేయబడియున్నది. ఈకూర్పునే జననంబాది నేరిచినేరిచి తనపాండిత్యనికషముచేతను బ్రతిభచేతను, శ్రీ నాథుడింతకన్న మధురముగా దనశైలి నలవరించినాడు. ఇతని ననుసరించిన యాయా కవులు తమతమకలవడిన ప్రతిభలతో నాయారీతులగ గవితల వెలయించినారు. చూతము.

సీ. మకరందమాని మైమఱచినగొనయంబు— ౨—౪౧౯
సీ. కాంతాజనంబుల కటివంక బొమలతో—ఎఱ్ఱన—
సీ. ముండటనెఱమావి మొక్కలనలరింప. శ్రీనాథుడు.
సీ. రతిదేవివెన్వేగు రారాపుచన్నులు. ,,

(౧) సీ. వనితలచేతిత ననకొప్పలిననొప్ప, ధర్మన్న.
ఉ. ఎక్కడివాఁడవన్న ఉ-హ ౨-౭-౧౪౭
ఉ. ఎక్కనివాఁడవెంతయును కా-౨-౫.
మ. హరిపంత ద్విపపంతి ఉ-హ ౨-౭౪౧
మ. హరిపంతద్విపదంతకుంతిముల నై౦

ఇట్టి వనేకములు. ఇట్టివి చూపించుట విషయమును వింతగాఁబోడిగించుట కావున మానుదును. ఒకేవిషయమును వర్ణించునపుడు కలిసెడు కలయికలుగాక పూర్తిగాఁ బోలికలు కలియుటయే మనము చూచుచున్నాము. ఇంతియకాక సీసము వ్రాయుటలో నాచన సోమనాథుని గురువుగా స్వీకరించియే శ్రీనాథుఁడు నేర్చుకొని గురువును మించిన శిష్యుఁడైనాఁడని చెప్పవలయును. సంస్కృతసమాసయుక్తములయిన సీసములను తెలుఁగుపదములతోఁ గూర్చిన సీసములను సరకుపరచి దగ్గఱఁబెట్టుకొని చూచికొనిన శైష్యోపాధ్యాయికయిట్టె తేలపడఁగలదు. నాచన సోముఁడు వచనములఁ గడుఁబ్రౌఢముగా వ్రాసినాఁడు. వైనతేయుని ముఱిపె భంజళికా సుడాలవల్లిలెఁబులను గతివికేషంబుల పగిది నీతనివచనములును మంచిగతులచే నొప్పారుచున్నవి.

(౧) అంపశయ్యనుండి యూహిన్యుఁడగు కాళిదాసుని బుతుసంహారము. చూ. ఆమ్రీమంజుల మంజరీ నరశరస్సత్కింశుకం యద్ధనుః । జ్యాయస్యాలికులం కలంకరహితం ఛత్రంసితాంశుస్సితం । మత్తేభో మలయానిలః పరభృతో యద్వందినో లోకజిత్ । సోఽయం వో వితరీతరీతు వితనుర్భద్రం వసంతాన్వితః ।

ఏకార్థబోధకంబులగు ననేకశబ్దములను నిఘంటువగునటు లును గొన్నియెడల వ్రాసినాఁడు. శ్రీనాథుఁడీపోకడను జక్కఁగాననుకరించినాఁడు కనుగొనుఁడు.

... చలంబుగొని పోరి పోరిలోఁదునుకలయ్యును దుమురయ్యును నింతింతలయ్యును నిసుమంతలయ్యును జిఱుసగ్గియ్యును జిదురుపలయ్యును మంచయ్యును మడిమంచయ్యును రూపుచెడినందిరుగుడువడి వాహినిచిక్కువడి చింపటవంపటయై యుసుడిసి మల్లామట్టలై యేపుదిగి యొప్పరుస పట్టయి యనువుతప్పి యపనపయై యంతంతనిలిచియవుసవుపై పాఱలేక పలపలనై వెఱఁగువడి వెల్లవెల్లనై చిదుముడి పడి చెల్లాచెదరై పోవపవంగి పోవుననాక్రంతై పోవిడిచి పోయినపోకై పోయినంగన ఉస-౧-౧౪౭

ఈవచనమును నెదుటనుంచుకొని రచించినాఁడో యన శ్రీనాథుఁడు హరవిలాసమున

సీ. అనుపుఁబ్బరి నొచ్చిరలసి రాపదనొంది
  రదవదలైరి చీకాకుపడిరి
యంగలార్చిరి విచ్చిరాఱడిఁ బొందిరి
  బ్రమసిరి పాటిరి సల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపికలైరి సొలసిరి
  కలకులఁగూసిరి కలిలపడిరి
గగ్గులకాడైరి కలఁగి కోటాడిరి
  వెలవెల్లనైరి నివ్వెఱఁగుపడిరి
గీ. యసవుసలునైరి గుజగుజలైరి డస్సి
సొల్లఁబోయిరి వెగ్గిరితల్లడిల్లిరి
సిగ్గువడిరి నొచ్చపడిరి యుస్సురుసురైరి
తారకుని చేతమునులు బృందారకులును. ౨-౧౦

ఈరీతిగా నట్టపదములనే సీసములోఁ దోడిగి రంగు తెప్పించినాఁడు.

నాచన సోముఁడు తేటతెల్లముగా స్వాభావికముగా వ్రాయనేరఁడు. అటులుకొన్ని పద్దెములున్నను మొత్తము మీఁది శైలి బహు ప్రౌఢమై గట్టిబిగిసియుండును. ఇతనిననుకరించినను ఎఱ్ఱాప్రెగడ యీతఁడు వ్రాసిన పద్యమునే మఱల వ్రాసినను సలఁతియలఁతి తునియలతో స్వాభావికముగా అందఱకుఁ దెల్లముగా వ్రాయనేరిచియున్నాఁడు.

సీ. మకరంపుఘాని మైలచిన గోనయంబు
వెస వ్రేయుఁగడిదోని పంటితోడ
జలజాకరరాజి జిల్లేడె (గ్లుడు) ముఁకగా
దాఁటుపరాగ పత్యుములతోడఁ
గన్నకాఁటపు మొగ్గకనెంపుగుబ్బగాఁ
గోయిల నోరి రు గోడుగులతోడ
రసికన్నుగన మచ్చరము చేయు పికెక్కంబు
నసెఁక పిలెంచు సేనకులతోడ

గీ. వలపుఁ దూపులు కరసాన వాఁడిచేసి
మండునెలతోడ పసమేసమామఱైన
సిందునెలతోడ నలరాజు నజ్జరేంద్రు
సభకు నేతెంచె భుజబలోత్సాహ మెసఁగ సోముఁడు.

సీ. ముంగట నెలమావి మొక్కలల నలరింపఁ
గఱితానగు చెలికాఁడు నడువ
నిరువంకలందును విరుల తేనియఁ గ్రోలు
దొరలు మోసంబునఁ ద్రుళ్లియాడ
నునుఁగుత్తుకలతీపుఁ గనగూయుపులుఁగుల
చారునాషములుకై వారములుగఁ

జంపనగిరిమండి చనుదెంచుచల్లని
బంట్లల్లపనులకుఁ బరువువెట్టఁ
గీ. జిలుకుమావులుగట్టిన చిగురుతేరి
పసిఁడిబలుమీను పడగయొడ్డసలమెఱయ
జెఱకువిల్లుపూవమ్ము లేడ్తెఁ ధరించి
గట్టబిగిసియేతెంచె నక్కడిమినుగఁడు. [ఏఱా ప్రెగడ]

సీ. కాంతాజనంబుల కతివంకబొమలతోఁ
బ్రతివచ్చుపుష్పచాపంబుతోడఁ
గోకిలవారితంబు గుక్కిళ్ళుమింగించు
క్రొమ్మావిచిగురాకు గొడుగుతోడ
రతిదేవినిడుసోగ గాఱులకన్నులడాలుఁ
దలపించుమీనకేతనముతోడ
భుజగనీలానతీ భుక్తశేషము లైన
గంధవాహకిశోరకములతోడ

గీ. జంగునితోవసంత మాసంబుతోడ
రాజకీరరథంబెక్కి పాలిభవమున
వచ్చెనలరాజుచిత్తాను వర్తనముగ
సంభ్రమముతోమహేంద్రు నాస్థానమునకు. [శ్రీనాథుఁడు.]

ఈకడపటి రెండుపద్యములకు మొదటిది మూలమై యున్నది. మొదటిపద్యమెన్నిసారులు చదివినను దనివితీరకున్నయది. కాని మిగుల ప్రౌఢమై ఝుటితిస్ఫూర్తి లేకున్నది. తరువాతి యేఱాప్రెగడపద్యమందఱకుఁ దెలియునట్టులను న్నదికాని (విఱుపులుచు) బాదాంతములందు, కై వారము లుగ నను సంధితగమనముతోనున్నది. శ్రీనాథుఁడీరెండు పద్యములనుజూచియే వ్రాసియుండును. కావున నీరెండుప ద్యములకలియుక యీపద్యముఁ గానవచ్చుచున్నది. ప్రతి

భావశక్తి కూడఁగలియుచో నిట్టిమనోహారిణియగు కవితయుప పన్నమగుఁగాని వేఱుతెఱఁగునఁగాదు. మొదటిపద్యమున నున్న ప్రౌఢి మిగిలినపద్యములలో లేదు. కొందఱీతని పద్యముకన్న నేత్రాప్రెగడపద్యమే బాగుగానున్నదనుచున్నారు. ‘ లోకోభిన్నరుచిః ’ కదా.

ఈతనిగుఱించి చిన్నయసూరిగారు,

క. ఘను నన్నయభట్టును ది
క్కన నేత్రాప్రెగడఁ బొగడి యనుకంపన యు
క్షుని దాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచన సోమనాథు స్తుతియొనరింతున్

అని మూఁడవకన్ను దాఁచినచిత్ప సర్వజ్ఞునిగాఁ బొగడి యున్నారు. బాలుజపల్లి సీతారామాచార్యులవారు,

“ అది మిక్కిలి ప్రౌఢమగు గాదు భారతమునకంటె నెల్లవిధములు విశేషించినదిగాను గానంబడుచున్నది ఇతనిని సర్వజ్ఞుఁడందురు. అట్లనుటకు సందేహింపఁబనిలేదు ”

అని వ్రాసిరి. అముద్రితగ్రంథచింతామణిలో, గొన్ని దోషములు చూపఁబడి,

ఈగ్రంథమున యతిప్రాసములయందు, ఱరేఫసాంకర్యమును నకారణకారసంశ్లేషణమును కనఁబడెడు దుష్ప్రయోగములు, కవిప్రమాదజన్యములుగానేని, కాలాతిశయమువలన, లేఖకాదికృత్యములుగానేని భావింపఁదగియున్నవి. కాని మనఃపూర్వకముగఁ గవి సూత్రచ్ఛేదము కావించినాఁడనుటకుఁ జాలినంతనిదర్శనము కనఁబడదు. ౧౦ సంపు– ౧౨ సంచిక.

అని ప్రకటితమయినది. శృంగారపద్యరత్నావళికిఁ టీక వ్రాసిన మోఢీ జగన్నాథమల్లు

నాచన సోమకవి రచించిన యుత్తరహరివంశంబుఁ బ్రథమాశ్వాసమునందు భయార్తనూర్వశినివర్ణించిన యీక్రిందిపద్యం (౧) బునందు శృంగారద్యోతకపదసంఘటనము హృద్యంబుగా నొనర్చెం గావున సర్వజ్ఞుండను (౨) బిరుదంబు వీరికిఁ గల్గియున్నదనుట కిదియ బోధకంబు.

అని తనయభిప్రాయంబు వివరించెను. ఇట్లెవరికిఁదోఁచినటులు వారు వ్రాసినారు.

నాచనసోమనాథునిది కమ్రప్రౌఢమయినశైలి. గూఢపదములతోఁ గూర్పఁబడియున్నది. ఇట్టి పదములు తిక్కనాదులలో లేకపోలేదుగాని యాపదములన్నియు విస్తృతమయిన భారతారణ్యమునందటనటఁ గ్రువ్వఁబడి యున్నవి. ఈతఁడువ్రాసినగ్రంథము, ఆఱాశ్వాసములలో నిమిడియున్నది కావున నామాఱుమూలపదములన్నియు నిచటఁ బ్రోవుచేసినటులున్నవి. ఈగూఢపదములలోఁ గూడిన యీతని శైలి భావములఁగప్పివుచ్చుచున్నదని మాత్రముచెప్పవలసియున్నది. కాళిదాసునికంటె భవభూతికొన్నియెడల సత్యుత్తమముగా వ్రాసియున్నాఁడుకాని శైలిలుబ్ధుఁడై పదముల కొఱకుఁ బరువులెత్తునటులఁగానుపించును. అట్టి యుపవాదముమాత్ర మీతనిపైనైచుటకుఁ గొంకుచున్నాఁడను. ఆదికవులరీతివేఱు. సోమనసాహిత్యరసపోషణమువేఱు.

ఒకకవిని మఱియొకకవితోఁబోలిచి హెచ్చుఁదగ్గులు వి

---

(౧) ౧.౫౭

(౨) ఈహేతువుచేనీతఁడుసర్వజ్ఞుఁడగు నెడలనిఁకఁగానివాఁడెవఁడు?

ంచుటకంటె నొకకవినే కైకొని యాకవి పాటించిన నియ
మను, కైలిమొదలగువానిని దానెట్లు నిర్వహించి
కృతార్థుఁడాయెనో విమర్శించి చూపుట న్యాయ్యము.
నః సోముఁడు తనకలవడిన శైలిలోఁ జక్కనిభావములు
గిచూపుటయందగ్రగణ్యుఁడు. ఈతనికి భావదారిద్ర్య
సుంతయేని లేదు. కవితాసామగ్రిపూర్తిగా నెలకొన్న
డు. ఈతని పాఠశాలలో శ్రీనాథుఁడు ప్రథముఁడు పోత
మాత్యుఁడు ద్వితీయుఁడు.

ఈతనికూరుపుసందుఁ జాలసామెతలు క్షీరనీరన్యాయ
గాఁగలసి సొంపు నింపు చున్నవి.
కొంద రితని సామెతలయందు నసహనము చూపుచున్నా
కాని వీనిలో నొక్కసామెతయు నస్థానపతితము కాలేదు
మతి లెక్కువగా నున్నచోఁ జెవికిఁగటువుగా నుండవ
ను. ఒక్కసామెతయే కాదు; అన్నియు నంతియే. అదియే
దిఅసహనముచూపుటకు హేతువయియుండుఁగాని మ
మకాదు. సరియగుచోట సామెతలను వాడుటకుఁగవి
ల లోకాభిజ్ఞుఁడయి యుండవలయుఁగాని లోకానభి
డు వానిముచ్చటలనుసుమంతయేని దెలియఁజాడు. భారత
నన్నయతిక్కనలునుజక్కగా సామెతల వ్రాసియున్నారు.
నే యీతఁడుపెంచినాఁడు. ఆసామెతలవలన నాకాల
గొంతచరిత్రము వాఙ్మయముకూడఁ దెలియఁదగు
ములేరుపడును.

"పిడుగు వైచినరీతి టోపి యాఁగునే ?" ౨-౮-౧౯౪౯

అనుసామెత యిందుఁగాననగున్నది. ఇపుడు టోపిపద

ము ఫెల్ టోపి కావునందుఁగాని తురుష్కులుతాల్చు శిరోవేష్ట

నమునందుఁగాని తెల్లవారు తాలుచు హాట్ నందుఁగాఁ

రూఢమయియున్నది. కాని యాకాలమున నీవ్యక్తులుకే

వా ? ఇపుడు ఫెల్ టోపి మొదలగువానియందుఁ టో

పియనుపదము రూఢమగుటచేఁ బూర్వమునఁ, దురుష్కుల

గాని కొండొకరుగాని తాల్చుశిరస్త్రాణమునందుఁ టోపిపద

ము వాడఁబడుచున్నదని యూహకలుగుచున్నదికాని యీ

పదము దేశ్యముగా నైఘంటుకులచేఁజెప్పఁబడుటచే నాఁ

ధ్రదేశ పురస్థాయులలోఁ గొందఱుచేనైనఁ టోపితాల్పఁ

బడుట యాచారముగానున్నదని వ్యక్తమగుచున్నది. కాక

మాన్నిమూ టీకవి

చ. జిలుగు మృణాలతంతు కృతచేలముతోఁ జిగురాకుటోపితో

× × ×

అని రాజవాహనవిజయమునఁ టోపియని ప్రయోగించి

నాఁడు, టోపియనఁగాఁ బట్టులోనగువానిచే నేర్పఱిచిన కిరీ

టమని శబ్దరత్నాకరము. ఆకాలమునందలి నెల్లూరిరెడ్లును,

అంతకుఁబూర్వపురాజులును నీటోపీని దాల్చుచుండిరేమో !

ఇటులు సామెతలతోడను నాచనసోమనాథుని కవిత్వ

ము వీనులవిందొనరించుచున్నది. ఈతనికవిత్వమును బలు

మాఱుచదివి పాఠకులు కృతార్థులగుదురుగాక.